# పాపులు

కవితా సంస్థానము

రచయిత :

"ఆంధ్ర బెర్నార్డ్ షా"

వేదాంత కవి

రచయిత :



" ఆంధ్ర బెర్నార్డ్‌షా "
వేదాంతకవి

# ఆంధ్ర బెర్నార్డ్ షా

## వేదాంతకవి

"ఎవరు. గొప్పో చెప్పం" డని ఒకప్పుడు కీర్తికాంతుడు జార్జి బెర్నార్డ్‌షాను ఎవరో అడిగార్ట. అందరికన్న గొప్పవాడు జార్జి, అందరికన్న మేటి బెర్నార్డ్, సాటిలేనివాడు షా" అని ముచ్చటగా ముమ్మాటికి తనే అని ఆత్మస్తుతి చేసుకొన్నాట్ట. ఇంతటి అహంకారిగా కనిపిస్తాడు శ్రీ వేదాంతకవి.

షా ఐరిష్ దేశస్థుడు. వేదాంతకవి భారతదేశస్థుడు. ఐతేనేం ఇద్దరికీ అహంకారం ముదిరింది. షా షేక్స్పియర్ మీదికి దూకితే వేదాంతకవి వాల్మీకి మీదకు దూకాడు. వేదాంతకవి రచించిన "పంజాదెబ్బ" చదివినవారికి వేదాంతకవి షా తెస్సు అవతార మేమో అని అనిపించకమానదు. అటువంటప్పుడు వేదాంతకవిని "ఆంధ్ర బెర్నార్డ్‌షా" అనటంలో ఆశ్చర్యంలేదు. అతిశయోక్తి లేదు.

ముఖాల్లో పోలికలు కన్పించినట్టుగా కూతల్లోనూ, వ్రాత ల్లోనూ పోలికలుండటం కద్దు. వాలకంలోనూ, వ్రాతలోనూ, కూతలోనూ వేదాంతకవి జార్జి బెర్నార్డ్‌షాను జ్ఞప్తికి తెస్తాడు.

వేదాంతకవిలో తెనాలి రామలింగడి లక్షణాలున్నై అని ఈ మధ్య ఒక మహాసభలో శ్రీ గిడుగు సీతాపతిరావుగా రన్నారు. రామలింగడూ బెర్నార్డ్‌షా వర్గానికి చెందిన పిడుగేనని గిడుగువార్కి తెల్సు.

తెనుఁగు సాహితీరంగంలో కవులు, కవిరాజులు, కవిసార్వభౌములు వారి వారి అంతే (బ్రాహ్మణ అబ్రాహ్మణ) చిరతలు పట్టి వైదికి, నియోగి, వగైరా కుల నృత్యాల్తో మన దుంప తెంపుతున్నారు. ఈ మహానుభావులకు దేశకాల పాత్ర శృతి జ్ఞానం శూన్యం. వేదాంతకవి దేశకాలపాత్ర శృతిలో తన్మయుఁడై తన కలాన్ని కదం తొక్కిస్తాడు. గేలెప్ తీయిస్తాడు. ఇదే వేదాంతకవి విశిష్టత, "షా" కూడా ఇంతే.

T. Nagar, Madras.
14-8-51

S. C. C. Chakravarti



# శ్రీ తిలకం

శ్రీ తిలకము విజ్ఞాన విఖ్యాతలక్ష్మి
కులికి ముద్దులమూట కట్టెడి కలమ్ము
కవన భువన బృందావన కల్పతరువు
రసికులు, విమర్శకులు దాని యసువులైరి॥

అక్షరము లప్సరసలై
రక్షకుడైనట్టి వాని రాగరసములై
లక్షయుగమ్ముల దాకా
భిక్షలు వేదాంతకవికి బెట్టెను కాదే॥

విశ్వభారతి విఱ్ఱవీగెడి సౌధమ్ము
కట్టి, నా జయభేరి కొట్టినాను
ఆనందలక్ష్మి నాట్యమ్ముచేసెడి తోట
వేసి నా సిరి యెగబోసినాను
భువనమోహనశక్తి కవనమల్లెడి కీర్తి
తెచ్చి నా చిన్ని ముద్దిచ్చినాను
సౌందర్యలత పూచి విందు సల్పెడిపూట
వచ్చి నా వజ్రాలు పఱచినాను

యుగయుగమ్ము లుప్పొంగ ఱ్ఱారు సొగసులోన
మంచి బంగారు పాపాయి గాంచినాను
పసిడిపంట బస్తాలకుఁ బట్టినాను
సుందరముగ బ్రహ్మానంద మందినాను.

వేదాంత కవి కాంతు లే దారి నడిచినా
కోటప్పకొండ ముక్కోటిప్రజలు
వేదాంత కవి కాంతు లే దేశమేగినా
బంగారుసభలు బంగారుప్రభలు
వేదాంత కవి కాంతు లే దిగ్గజముకైన
గుండెహడలు పూలదండ పోడలు
వేదాంత కవి కాంతు లే దేవునికినైన
మోహనములు రత్నభూషణములు

ఎంత వెలకైన భువిపైన నెవనికైన
పట్టువడునె? ముట్టఁబడునె? తట్టఁబడునె?
ఇంత వేదాంత కవి కాంతు లీయుగాన
ఏమటంచు భావించి యూహించినారొ!

వేదాంత కవీంద్రుని కిల
పాదాక్రాంతుండు కాని వాడు కలండే?
వేదండాలను ధరపై
కోదండము తీయు వీరకోవిదుఁడితడే॥

"ఆంధ్ర బెర్నార్డ్షా"
వేదాంతకవి, కవితాసంస్థానం
వి జ య వా డ.



# ఇవేనర్రో నా జప తపాలు

అక్షరబ్రహ్మనై కవనమల్లెడి వాఁడనునేను. విశ్వ ఫా
లాక్షుని నిర్వరించెడి మహాప్రతిభా గతి భా గ్వీలాస కా
మాక్షిని గొల్చి రాక్షసుఁడనై తిని గాని, మదీయకావ్య సం
ప్రోక్షణతో పవిత్రమయి భూమిజనుల్ తరియించ
కుందురా?

బ్రతికిన నాల్గురోజులు ప్రపంచ
మహా ప్రళయాబ్ధి మధ్య ఘో
ర తిమి తిమింగిలాలపయి రాజ
పరాక్రమ శౌర్యధుర్యుఁడై
మెతుకులు పుట్ట కెక్కడ గమించిన
విప్లవ వీరమూర్తి సం
స్తుతి కవనాల తొల్కరిగఁ .దొర్త
కళాభువనాలఁ జేతురా....

చెమటల్ కార్చి చతుస్సముద్రముల
రాశింబోసి యీ మంటి గ
ద్ద మహాలక్ష్మినిఁ జేసి భూప్రజకు
శ్రేష్ఠంబైన పుణ్యంబు శాం
తము పండించి విశాల విశ్వజన
సంస్థానమ్ము కూర్మావతా
రఃముగా మోసెడి కూలితండ్రిని
సదా ప్రార్థించి యర్థించెదఁ....

— వే తా ం త క వి.

# నన్నే పట్టుకోటం?



చెవులకు చెప్పటానికి, కండ్లకు కనిపించటానికి, ఊహా లకు వూహించడానికి, అలవిగాని వికారాల్లో కొట్టుకుంటున్న స్వభావాలకి, నేను చిరునవ్వునవ్వి, అక్షరాలు వర్షిస్తున్నా. ఇది నా ఇచ్ఛ.

నేనే అనంతకోటి భువనాలకు, కవనాలకు, అవకాశాన్నై, అక్షరకన్యల్ని, విలసిత విప్లవ విజ్ఞాన మధుర మంజుల వాగ్విలాస సంగీత భంగిమాలతో మెఱపించి, కులికించి, ఆనందవర్షం దేశ దేశాల్లో కురిపించి, కల్యాణ భారతుల్ని చూస్తున్నా. యుగ యుగాల విజ్ఞాన యువతీలలామల్ని, చిట్టిముత్తైదుల్ని చేసి, హారతులు పట్టిస్తున్నా.

ఇంత ఆనంద బృందావనాల్లో కుట్మలించి, కుసుమించి. ఫలించి, పుష్పఫలభరిత శోభాయమానమై విరాజిల్లుచున్న విజ్ఞాన కల్పవృక్షాలు మాత్రం నేనెవణ్ణో, ఎటువంటిదాన్నో, ఏవునికి పట్టులో, ఏమనికిపట్టులో కన్పిస్తానో యీ అనంతకోటి భువన బృందావన కల్పవృక్షరాజాలు యేమాత్రం తెలుసుకోలేక, నానా జీవగళ నాళాలతో, వికారాలు ఆలాపిస్తున్నై.

నా ఇచ్ఛలోంచి, సంజనితమై, సంభ్రమమై, సంక్షోభితమై, చెలరేగిన గందరగోళాలకి నేనేనా జడిసేది? కులమత జాతివర్గ, పక్ష, కక్ష విభేద విద్వేషాలు భువనపరిణామాలతో లేస్తున్న గాలి

దుమారాల్లో నేను మలయమారుతమై, ఆనందమై, మకరందమై యున్నమాట కనిపెట్టలేని జగత్తుకి నేను కిమ్మత్తు కట్టేదిలేదు.

నేను చీమకరుపుతో, దోమటొజ్జతో సహితం సంతృప్తి పడుతున్నప్పుడు, నాకు గిట్టని పదార్థం, యధార్థం, యేదీలేదు గదా! యీమాత్రంకూడా తెలుసుకోలేని వట్టిచప్పుడు చేస్తున్న ధోరణికేనా, నేను అనంతకోటిభువన పరిపాలకత్వం కట్టబెట్టేది? నా వెనక గొంతులుచించుకొని. గంతులువేస్తున్న నానీడలకేనా నేను కనిపించేది? యీ నీడలేనా నాకు కనుపించకపోయేది? అవస్థల్ని, ఐశ్వర్యాల్ని, కీర్తి కిరీటాల్ని తగిలించుకుని, అనుభవిస్తున్నది నేనైతే! యీ నాప్రక్కనుబడ్డ నా నీడలు అవేమిటో అనుభవిస్తున్నట్లు, అఘోరిస్తున్నట్లు, ఎంతో గమ్మత్తుగా నటిస్తున్నై. యీ నీడలయొక్క నటనల్ని వెనుతిరిగి చూచుకుని, మురిసిపడుతున్న వెర్రివాణ్ణేంకాదు. నల్లికెల పాముల్ని, నాగుబాముల్ని, వెయ్యిపడగలు విప్పిన ఆదిశేషుణ్ణి చూచి, వులిక్కిపడి, అసహ్యపడిన తత్వాలకి వాటి జీవిత సౌందర్యారాధన చూపిస్తున్నది నేనే అయియున్నప్పుడు, వాటిమీద దెబ్బపడ్డప్పుడు, నేనెంతచురుకైన చూపుతో చూడగలుగుచున్నానో, జీవంలేని కర్రలకి, భావం లేని బుఱ్ఱలకి యేం తెలుస్తుంది? అంచేతనే, కర్రలు విరిగిపోతున్నై. బుర్రలు తిరిగిపోతున్నై, గాని నన్ను పట్టుకోడంగాని, చావగొట్టడంగాని, యెప్పుడూ లేనప్పుడు, నేను గ్రహించేది, సహించేది, నడిపించేది, జడిపించేది దేనికోసం? యిదే నా ఇచ్ఛ. నేనువేసిన నాటకశాలలో యీ వేషాలన్నీ నావేగా! అటువంటప్పుడు, నాప్రక్కనున్న యింతంత స్వాములకు, అంతంత గడ్డివాములకు, నేనుజడిస్తే నాటకం జరిగేదెట్లా? నాకంటే

యెత్తుగా మొలిచిన తాడిచెట్లకీ, పెద్ద పర్వతాలకీ నా నిశిత సుదర్శన, ప్రదర్శన భయంకర శక్తిసామర్థ్యం యేమి తెలుస్తుంది? నిలువునాబడి, పటాపంచలై, బవాబదలై, అనంతకోటి జగన్ని ర్మాణ కథాకలాపానికి పనిముట్లులై పడివుంటున్నదికూడా తెలియ నప్పుడు, వట్టిచప్పుడు నాకు హితోపదేశమా ?

ఏకత్వంలోనే భిన్నత్వమున్నదని, భిన్నత్వంలోనే ఏకత్వం వున్నదని, నేను తేల్చిన నాలెఖ్ఖ, నాకు తెలిసినట్లు, నా రంగురంగుల చొక్కాలకి, నారకరకాల తొడవులకి, పాపము యేమితెలుస్తుంది ? నేను పట్టించిన ముచ్చెమటలు, నేను పులిమిన సుగంధాలు, ఘుమా యిస్తున్న గోళవాసనా పరిశీలన, నాకు తెలుస్తున్నట్లు, నా చిరిగి పోయే చొక్కాలకు యేమితెలుస్తుంది ? ముచ్చెమటల్ని పట్టించు కున్న దుస్తులు, సుగంధాలు పులుముకున్న సుకుమార దుస్తులు, నా చాకలిరేవులోబడి, నా దెబ్బలు తిని, నాచేత వుతికించుకుని అప్పుడప్పుడు యిస్త్రీ చేయించుకోడంకూడా, నాకు తెలిసినట్లు, యీ మురికి గుడ్డలమూటలకి యేమితెలుస్తుంది ? గౌరవంగా, భక్తిపురస్సరంగా తిరుపతిక్షవరం నా మెత్తని కత్తిచే చేయించు కుంటున్నవాని పరమానందం, నాకు తెలుస్తున్నట్లు నెత్తినుంచి రాలిపోతున్న సుగంధ శిరోజాలకి యేమి తెలుస్తుంది ? చిత్రవిచి త్రాలైన, ముద్దులొలుకుచున్న, నగిషీల్ని చెక్కించుకోటంకోసం పడివున్న చట్టుబండలికి, కొయ్యలకి, నా పదునైన వులిలోంచి దిగుతున్న పనితనం, బాధ యేం తెలుస్తుంది ? యిట్లాగే, అనంత కోటి సృష్టిజాలాలికి, అద్భుతమైన చిత్ర రూపరేఖావిలాసాలు యిస్తున్న నాహస్తలాఘవం, నాఅనంతకోటిసృష్టికల్పనాకౌశలం నాపనిముట్లకు యేమాత్రం తెలియదు గదా ! నాపనిముట్లు

నాచేత వాడబడనప్పుడు తుప్పుబట్టి, నిరర్థక శబ్దక్షేత్రాల్లోబడి, నిరుపయోగమైపోతున్నాయని, నాకు తెలిసినట్లు వాటికేం తెలుస్తుంది ? పాపము ! అంచేతనే వూరికే పనిలేక, తుప్పుపట్టి యున్న సామగ్రిని చక్కగా దులుపుకుని, నా అప్రతిహతమైన ప్రతిభాప్రభావసంకల్పసంజనిత బ్రహ్మాండ నిర్మాణాలకి, అప్పు డప్పుడు నేను కదిలిస్తున్నప్పుడు విప్లవాలు, విలయాలు లేచి, తాండవిస్తున్న విలయ, వికటాట్టహాసాలకి నేనేనా బెదరేది ? నా ఇచ్ఛప్రకారం నడుచుకోకుండా యుండేది ? నాఅనంతకోటి జగన్నిర్మాణపరిణామ యుగవిజ్ఞానప్రవాహాలకి అడ్డువచ్చేదేది ? ఆపగలిగేదేది ?

"కాలొడ్డి నాగునే గాంగయురము"

అసలు నానాబాధలుపడి, భారాలుపడి, ఘోరాలుపడి, పిడుగులుపడి, గుండెలు వ్రయ్యలై, సెలయేటి కన్నీటికాల్వలై కనిపిస్తున్న భూదేవి సమస్త జీవరాసుల్ని పోషించి, ప్రోత్సహిం చడానికి తాను మట్టిగా తయారై, బంగారుపంటల్ని, సుగంధరస వర్గాల్ని, నవరత్నమాణిక్యాల్ని ప్రసాదిస్తున్నట్లు, వట్టి చప్పుడు చేస్తున్న యీశాస్త్రాలు యేంప్రసాదిస్తున్నయ్యో నేను కనిపెడు తూనేయున్నా ! మట్టిలో కనిపిస్తున్న ఔదార్య సౌందర్య గాంభీర్య ప్రోత్సాహ భావభాగ్యం నాముందు మహామహా లను కుంటున్న వెర్రి వెర్రి వేషాలలో, పనికిరాని రోషాల్లో, నా కే మాత్రం కనుపించటంలేదు. అటువంటప్పుడు యిట్లా మట్టిగా కనుపిస్తున్న భూదేవిని, మాలిన్య రహితమైన, విశ్వవిజ్ఞాన సహస్ర శీర్షాలతో మోస్తున్న, నా కవన నాగరాజును చూచి సహించలేని, గ్రహించలేని అసహన మతోన్మాదకూటాల

గోలల్ని నేను కనిపెట్టటంలేదని భావించి, గర్వించి, కవ్వించి, కవ్విస్తున్న కాలాన్ని కనిపెడుతునే యున్నా.

చెట్టు చేమలు, మట్టిగడ్డలు, వాటి కీర్తికిరీటాలకోసం ఎన్నడూ పాటుపడుతున్నట్లు, ప్రాకులాడుతున్నట్లు ఏ యుగాల చరిత్ర ధరిత్రీమండలాలలో నేను వ్రాయలేదు; నేను చూడలేదు. అటువంటి ప్రతిఫలవాంఛారహితమైన పరివ్రాజక వేషాల్ని కూడా ఏదేశాల్లోను వందలతరబడి నేను తయారుచేయడంలేదు.

చెట్టు చేమలు, మట్టిగడ్డలు నా విజ్ఞాన కోశాలుగాని, గురుపీఠాలు గావు. ముఖ్యంగా, జీవితాల్ని హూనం హూనం చేస్తున్న నరకాలు నాకు ప్రాణప్రధానాలుగాని, పనీపాటాలేక, అయోమయమైన, ఆనందాల్ని అనుభవించటానికి తేరగా తయారై తుప్పుపట్టిస్తున్న స్వర్గాలుమాత్రంగావు. యీ స్వర్గాల్ని బలిసి బిఱ్ఱబిగిసిపోయిన సోమరితనాలు లేవదీస్తున్నయ్యని నేను కనిపెడుతూనే యున్నా. మనశ్శాంతి లేకుండాయున్న వారిలోంచి, నేను జ్ఞానమాణిక్యాలుగ కనుపించే వాణ్ణి గాని, తేరగామేసి, బలిసి మనశ్శాంతి వచ్చినవాణ్ణి, నా ఇచ్ఛకోసం నా చూపులో పెట్టుకొనేది లేదు. శాంతిలేనప్పుడే విజ్ఞానం వచ్చేది.

నా ఇచ్ఛ యెల్లప్పుడు మనశ్శాంతిలేనివానిలో ప్రజ్వలింపజేసి చిరునవ్వుల తొలకరి కులికించి అనంతకోటి విశ్వానంద నందన వనాలికి నేను వసంతుడనై, మంజులవాగ్విలాస సుధారసాల్ని చల్లని సుగంధమయ మారుతాలతో విఱజిమ్ముకుని, పూలదోసిళ్లతో జుట్టుకుని భావమేఘుణ్ణై అనంతభావాంబరవిహంగ వీరవిహారం జేసి, నేను కడవపోతగా కవితాసుధారసవృష్టి గురిపించి, దేశదేశాల్ని

సదుద్దేశాలుగా పండించి వసుధైవకుటుంబం నెలకొల్పటానికి నేను భగవన్మతరాజ్యపతాకం అనంతకోటి భువనాలికి చూపి అనంత విశ్వ విజ్ఞాన సహస్రశీర్షాలతో చివురించి కనుపిస్తున్నా. ఇదే నా ఇచ్ఛ! ఇదే నానవ్వు! ఇన్నాళ్టిగ్గూడా నేనుమీకడుపులో పరుండి ఆడిస్తున్న నా నాటకాలకి సూత్రధారుణ్ణి నేనే నన్న నా మాట ముఖ్యంగా ఈ అజీర్తి పరివ్రాజక బృందానికి బపం కాకపోదు. నేను మీకేమన్నా సప్లయిచేస్తే, మీకు మీరంతా కట్టగట్టుకుని నాకు రిప్లై యిచ్చేది వుంటుంది. వ్యర్థపదాల్ని దించ లేని నిస్సత్తువగలవాణ్ణి నేనే!



# పూ జా ం జ లి



రసికులు సరసులు. ఈ రసగ్రహణపారీణులు, విశాలవిశ్వ విజ్ఞాన చతురులై లలితకళా ప్రపంచబృందావన బృందారక బ్రహ్మానంద భరితులై విరాజిల్లుతున్నప్పుడుగాని జగత్కళ రసతరంగిణి కాదు. సమస్త సమస్యాపరిష్కారిణి కాదు.

అందుకే యుగయుగాల్నుంచి, దేశదేశాల్లోంచి రసగంగా ధరులు సాక్షాత్కరించి, సురుచిరసుకుమార కవితా గాన శిల్ప నాట్యకళా నందనవనాల్లో వసంతులై, జయంతులై, మంజుల వాగ్విలాస మృదుమనోహరభావపల్లవాల్ని, అనంత శబ్దసుందరీ నవరత్న మాణిక్య కావ్యకుసుమాల్ని, ఆనంద రసాలసాల ఫల రసాల్ని విలసిల్లజేసి, శుకపికశారికాసౌందర్యశకుంతాల్ని చిట్టి ముత్తైదువులుగా పరిఢవిల్లజేసి త్రిజగన్మనోహర శివతాండవాలతో, బ్రహ్మాండ సామ్రాజ్య పట్టాభిషేకాలతో గౌరీశంకరులై, లక్ష్మీ నారాయణులై, వాణీవల్లభులై పాలిస్తున్నారు.

ఆ రసమనోహరుల యేలుబడితో నాజూకుగా, తేజోవం తంగా వికసిస్తున్న యీ తెలుగుతల్లి నోములతోటలో అక్షర కన్యల్ని అప్సరసల్నిజేసి అమృతగానవిజ్ఞానవినోదవిన్యాసాలతో, మహోపన్యాసాలతో, భగవన్నామసంకీర్తనలతో తొలుత మహా రాష్ట్రభక్త శిఖామణులు ప్రచారం సాగించిన ఆచారం కొండొకటి గలదు. తన్మనోహర భక్తి జ్ఞాన వైరాగ్యభావ భాగవతోత్తముల్ని సందర్శించి తత్కాలక్షేపాల్ని పురస్కరించుకొని, కొన్ని హావ

భావవిన్యాసాల్ని సంస్కరించుకొని, శ్రీ కనకదుర్గాచరణరాజీవా లకి నమస్కరించుకొని శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు విశ్వవిజ్ఞాన చతుర్ముఖబ్రహ్మలై, కథాపితామహులై హరికథా జగత్సృష్టి బ్రహ్మాండంగా సృష్టించి వారి యావజ్జీవితం హరికథా ప్రపంచానికి, హరికథావిద్యార్థులకి ధారపోసి పోషించారు.

సాహసవాక్కుతో భరతశాస్త్రతరంగ మృదంగవాహినీ
మోహిని కులుక్కుతో భువనమోహనమూర్తి చలోక్తిగానస
న్నాహముతో ధణంధణ ఘనంఘన నిస్వనకింకిణీ కళా
వ్యూహముతో సభాజగతి నూపిన ధట్టుడు ఆదిభట్టురా॥

ఆ హరికథావతారమూర్తికి సమకాలికులై, బుధజనవిధే యులై, రసికజనమనోభిరాములై, కమ్మకమ్మని తెనుగు కవితా విశారదులై, పరమభాగవతోత్తములై, తపాలాబంధ్రోతులై శ్రీ బాలాజీదాసుగారు మృదుమధురంగా, అనేకంగా హరికథల్ని వ్రాసి హరికథాకాలక్షేపములుచేసి శాశ్వతమైన హరికథా భిక్షపెట్టి కృతార్థులై చరితార్థులైనారు.

వీరి సమకాలికులై, అఖండప్రజ్ఞాధురీణులై, హరికథావిధా తృలై శ్రీ ఎరుకయ్యదాసుగారు, శ్రీ భోగలింగదాసుగారు హరికథ లెన్నియో రుచించేటట్టుగా రచించి, కాలక్షేపాలుగావించి విశ్వవిఖ్యాతి గడించారు. శ్రీ నారాయణదాసుగారుగూడా ఆశ్చర్యచకితులయ్యేట్లు, ఆనందభరితులయ్యేట్లు యావదాంధ్రదేశాన్ని కథలతో మారు మోగించారు.

వారి పరిమళ్లా శ్రీ పరిమి సుబ్రహ్మణ్యభాగవతారుగారు అశేషశేముషీదురంధరులై మహాభారతాన్ని హరికథగారచించి శ్రావ్యంగా హరికథాకాలక్షేపాలు గావించారు.

తరువాత నరసాపుర వాస్తవ్యులైన, సరస కవితారసమనో హరులైన శ్రీ దీక్షితదాసుగారు హరికథాజగత్సుందరిని కొంత వినూత్నరూపరేఖావిలాసాలతో నవరత్నవిభూషితాంగిగా కులికించారు. ఈ అధునాతన విశ్వవిజ్ఞాన భావచైతన్యాన్ని కథలలో రసవంతంగా చిత్రించారు. శ్రీ దీక్షితులుగారు ప్రస్తుత హరికథా జగదేకారాధ్యులై విరాజిల్లుతున్నమాట వాస్తవం. నవీన హరికథా ప్రపంచ భాగవతోత్తములందరికీ మార్గదర్శులైనమాటగూడా విశ్వసింపదగ్గవిషయం.

నెల్లూరు వాస్తవ్యులు, సుందరసుకుమారగానకళాతుంబురులై, హరికథాభారతీవాగ్విలాసమంజరులై శ్రీ జూటూరు రామదాసుభాగవతారుగారు జగన్మనోహరంగా, రసభరితంగా హరికథాకాలక్షేపాలుచేసి జగత్కీర్తిగడించారు.

బెజవాడ వాస్తవ్యులు, హరికథావిశారదులు శ్రీ గొత్తి కామరాజుభాగవతారుగారు చాకచక్యంగా, శ్రవణసౌఖ్యంగా ప్రపంచపరిజ్ఞానపుష్టితో హరికథాకాలక్షేపాలు చేస్తున్నారు.

ఈ హరికథా పరిమేష్ఠికి సమకాలికులై, సరసకథాకవితా ప్రవీణులై అనంతభావగంభీర బిరుదాంకితులై శ్రీ కడలి వీర దాసుగారు ఎన్నియో హరికథల్నివ్రాసి, ఎంతో దేశం తిరిగి హరికథాకాలక్షేపాలుచేసి, యశమూ, ధనమూ గడిస్తున్నారు.

వీరందరికి సమకాలికులు సరసచతురోక్తికథావిశారదులు, సువర్ణగండపెండేరఘంటాకంకణధారులు, కథాపయోధి బిరుదాంకితులు శ్రీ ఉమాకాంతదాసుగారు యావదాంధ్రదేశంలో జగన్మనోహరంగా హరికథాకాలక్షేపాలు గావించారు

ఇటీవల వీరందరి ఆదరాభిమానాలికి, కీర్తి గౌరవాలకి ముఖ్యులై హరికథావిధాన పంచాననులై, సరససాహిత్యకవితా దిగ్గజములై, సువర్ణగండపెండేరనవరత్నఘంటాకంకణ విభూషితులై విరాజిల్లుతున్న శ్రీ పాతూరి మధుసూదనశాస్త్రిగారు పాండిత్యాన్ని పిండి సర్వజనాకర్షణీయంగా హరికథ చెబుతున్న సంగతి యథార్థం.

మధు శత్రువు కథచెప్పిన
బధిరాంధులుకూడ నేడు పయనంబయిరే
విధివ్రాత యెట్టులున్నను
బుధులందరు వానికింక మ్రొక్కక చనరే ॥

అంత ప్రతిభగలవారు, అటువంటి చాతుర్యంగలవారు. కథకులలో సర్వసాధారణంగా శ్రుతపాండిత్యం మెండు. అది యీ హరికథాసూరికి బాగా తెలుసు. అంచేత వీరి ఘుం దెవరి పప్పు ఉడకపనుకుంటాను.

పోతే, యింకా యీ హరికథా జగద్రచయితలు చాలా మంది మారుమూలల్లో వుండవచ్చు. ఎప్పుడో అప్పుడు ఆమహానుభావులుగూడా ఆటంబాంబులల్లే హడలెత్తించకపోరు.

పోతే, యిహ నారాయణదాసుగారిమల్లే స్ఫురద్రూపులై, ఆజానుబాహులై, పెద్ద బుర్రమీసాలు కలవారై నారాయణదాసు గారి కరంమాదిరి (క్రోసెడు దూరం లెఖ్ఖలేకుండా వినిపించే) జలద గంబీరగళమై, ప్రపంచానుభవంతో నవరసభరితంగా కీ॥ శే॥ శ్రీ భవరుదాసుగారు హరికథచెప్పి మహామహుల్ని. మహా

జనుల్ని ఒప్పించారు; అనేక గండపెండేర బహుమానాలు గడించారు.

ఇంతటి హరికథా కీర్తికిరీటాన్ని ధరించి కథాప్రపంచాన్ని పాలించిన యీ భవరుదాసుగారి, అంగరగ్రామ వాస్తవ్యులై, శిష్యమాణిక్యములై, విజ్ఞాన విధేయులై, చక్కని సమన్వయ జ్ఞానంతో, రసవంతంగా కవనమల్లి, కర్ణరసాయనంగా శ్రీ బళ్ల బసవలింగభాగవతారుగారు హరికథాకాలక్షేపములు చేస్తున్నారు.

ఇంకా వీరికంటే నారాయణదాసుగారి శిష్యరత్నములై, నవ మన్మధాకారులై, స్ఫుటమైన మధురవాక్కు కలవారై, అమృతగాన ధురీణులై కీ॥ శే॥ చేబ్రోలు బాలకృష్ణదాసుగారు అమోఘమయిన హరికథాసుధారసధారలు వర్షించి శ్రీ నారాయణదాసుగార్ని తన్మయుల్ని చేసిన సమర్ధులు, కృతార్ధులు.

ఐతే నారాయణదాసుగారి ప్రధమశిష్యశ్రేణిలో ముఖ్యులు ముగ్గురున్నారు. వారిలో ఒకరు మంజులవాగ్విలాస నాట్యకళా గాన లయబ్రహ్మలనిపించుకున్నవారు, గొప్ప గంభీరమైన పురుషశారీరం కలవారు, హరికథావతంస బిరుదాంకితులైనవారు శ్రీ వాజపేయాజుల సుబ్బయ్యభాగవతారుగారు. వీరికి హరికథా పాండిత్యం నిర్దుష్టంగా గలదని ఘంటాపథంగా చెప్పి నొక్కి వక్కాణిస్తాను. వీరు అనేక విద్వత్సభలలో జగజ్జేగీయమానంగా హరికథాకాలక్షేపాలు చేసి అఖండ సత్కారాలు, బహుమానాలు జరిపించుకొన్నారు.

ఇంకా వీరి తరువాత అనర్గళమైన వాక్చాతుర్యంతో మధుర మంజుల గానకళామాధుర్యంతో ఒక్క ఆంధ్రదేశమేగాక తమిళ

కర్నాటక మహారాష్ట్ర తెలంగాణా దేశాలలో గూడా హరికథా కాలక్షేపాలుచేసి క్షేత్రయాత్ర గావించినవారు, హరికథాకేసరి బిరుదాంకితులై దబ్బాదాసుల్ని, ఢంకాపలాసుల్ని హడలెత్తించిన వారు, మహాజనుల్ని ఆనందగానసుధారసవారాణ్ణిధిలో ముంచెత్తినవారు శ్రీ నేతి లక్ష్మీనారాయణభాగవతారుగారు. వీరు శ్రోత్రియులు. స్మార్తం క్షుణ్ణంగా వచ్చినవారు. అంచేత వీరి వాక్కులలో వర్ణక్రమదోషాలేవీ దొర్లేవికావు. రసవంతంగా వీరు రామాయణం కథాకాలక్షేపంచేసి మహామహుల్ని, విద్యాసాగరుల్ని మెప్పించినవారు. వీరికీర్తి జగత్తంతా మారుమోగింది.

ఇహ నారాయణదాసుగారి ప్రధానశిష్యశ్రేణిలో మూడవ వారు శ్రీ గొల్లపూడి రామమూర్తిభాగవతారుగారు. వీరు అంగుష్ఠ మాత్రులు. అఖండప్రతిభావంతులు. అద్వితీయకథావినోదకళా ధౌరేయులు. అమోఘభక్తిరసభావకథావిజ్ఞానులు. అనుభవజ్ఞులు. యావదాంధ్రదేశ పరిచయులు. ఏ యే కథకులలో సత్తా ఎంతెంతవుందో వీరికి బాగా తెలుసు. అంటే నాణెంగల సరుకును బాగా గ్రహించి చెప్పే కుశాగ్రబుద్ధిసంపన్నులన్నమాట. వీరు సర్వస్వతంత్రులు. రామసేవానిరతులు. హరికథలో వీరుకూడా చాలా గడించినవారే; ఐతే రామార్పణం చేసుకున్నారు.

వీరందరి సభ్యతాకిరీటాలకి, విద్వత్కవచాలకి తీసిపోని హరికథావిద్వత్శిఖామణులై, సంగీతకళాధురీణులైన, ఈమని గ్రామవాస్తవ్యులైన శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు సరళమైన శారీరంతో, సంస్కృతవాచామాధుర్యంతో శ్లాఘనీయంగా దేశమంతటా హరికథాకాలక్షేపాలు చేసి ధనం, ఘనం బహు బాగా గడించారు.

దాదాపుగా ఈ సంగమేశ్వరశాస్త్రిగారికి తీసిపోనట్లుగానే శ్రీ కావలి సీతారామభాగవతారుగారు చక్కని సంగీతజ్ఞానంతో, చమత్కారవాచానైపుణ్యంతో ప్రహ్లాద, రామదాసు, మొదలుగాగల హరికథలు రసవంతంగా చెప్పేవారు, వీరూ కొన్నాళ్లు నవరసుగానే చెలామణైనారు.

ఇంకోరు అవనిగడ్డ వాస్తవ్యులై హరికథావిజ్ఞానపుష్టి గలవారై, గంభీరగళంగలవారై, మధురమైన గానం కలవారై సమయస్ఫూర్తిగా, సందర్భానుసారంగా, అతిచమత్కారంగా శ్రీనేదూరి విశ్వనాథంభాగవతారుగారు హరికథాకాలక్షేపాలు చేస్తున్నారు.

ఈ హరికథామహామహుల్నందర్నీ ఆశ్చర్యచకితుల్నిచేసి హరికథాదక్షులై, మృదుమధురగానగంధర్వులై, శ్రీ అద్దేపల్లి లక్ష్మణశాస్త్రి భాగవతారుగారు అద్వితీయంగా కథాకాలక్షేపంచేస్తున్నారు.

తణుకువాస్తవ్యులు శ్రీ దీక్షితులవారి హరికథాకల్పతరువులు కీ॥ శే॥ ముసునూరి సూర్యనారాయణభాగవతారుగారు అతిచాకచక్యంగా అమృతగానసుధారసతరంగాలతో హరికథాకాలక్షేపాలు చేసి తెనుగుతల్లి పసిడిపంట అనిపించుకున్నారు.

నరసారావుపేట హైస్కూలు గణితశాస్త్రోపాధ్యాయులై, విశ్వవిజ్ఞాన గానకళాసంపన్నులై, పరమభక్తాగ్రగణ్యులై, సహజ చమత్కార వాగ్విలాసధౌరేయులై, ఆంగ్లేయభాషాపరిచయులై, భక్తిపరవశత్వంతో మైమరపువచ్చేటట్లు హరికథాకాలక్షేపంచేయువారిలో దక్షులై, శ్రీ కురంగేశ్వరరావుగారు రామకథాసుధారసం జీవనదీప్రవాహాలుగా ప్రవహింపచేస్తున్నారు.

తెనాలివాస్తవ్యులు, మృదుమధురసౌందర్యగానకళా విశారదులు, మంజులవాగ్విలాసకథామనోభిరాములు శ్రీ అమ్మల విశ్వనాధంభాగవతారుగారు నవరసభరితంగా హరికథాకాలక్షేపములుచేసి యావదాంధ్రదేశీయుల మన్ననలకు, బహుమానములకుం పాత్రులగుచున్నారు.

ఇహ తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురవాస్తవ్యులై నాట్యకళాశిఖామణులై, అమృతగానగంధర్వులై, హాస్యకళారత్నములై, అనర్గళవాగ్ధారాధరగంభీరులై, హరికథావారాణ్ణిధులై, అందెవేసి, పందెంవేసి, అనివార్యశౌర్యంతో పాటపాడి. మాట మాట్లాడి, ఆట ఆడి శ్రీ బాలకృష్ణభాగవతారుగారు అపూర్వంగా హరికథా కాలక్షేపం జేస్తున్నారు. వీరు రమారమి నారాయణదాసుగారి గంభీరగళం కలిగి, అందులోంచి బిస్మిల్లా సన్నాయిపాట జిలుగులు, కులుకులు తీసి మురిపిస్తున్నారు. దేశం వీర్ని బాగా ఆదరించి అదృష్టం సంపాదించుకోవాలి.

ఇంకా పశ్చిమగోదావరిజిల్లా గణపవరం కాపురస్తులై. కాయపుష్టికలవారై, గాత్రపుష్టికలవారై, అనర్గళమైన సంగీతసుధారసతరంగాలు, భరతశాస్త్రతరంగాలు దుమికించగలవారై, హరికథాజగత్తులో ప్రవేశించి విజ్ఞానవిధేయులైన శ్రీ ముదుపాక మల్లేశ్వరభాగవతారుగారు డైమండ్‌వంటి డిమాండుగలవారై, హరికథాకాలక్షేపాలు, అనేక పట్టణ గ్రామాలలో ఎడతెరపిలేకుండా చేస్తున్నారు. వీరు మునుముందు తెనుగుతల్లి నోములతోటలో వజ్రాలపంట పండించగలరని ఆశిస్తున్నాను.

గుంటూరుజిల్లా సత్తెనపల్లి వాస్తవ్యులై, అతులిత భక్తిభావభాగ్యసంపన్నులై, హరికథలు అనేకంగా శ్రీ

అంబడిపూడి రామనాథం భాగవతారుగారు రసవంతంగా చెబుతున్నారు. వీరికథలు నచ్చనివారులేరు.

ఇహ సత్తెనపల్లి వాస్తవ్యులై, మహమ్మదీయ మతస్థులై, రామాయణ, భారతాది హరికథల్ని అతిచాతుర్యంగా, మంజులవాగ్విలాసమాధుర్యంగా చెబుతున్న భాగవతారులై, బుధజనవిధేయులై శ్రీ షేక్ శిలారు సాహేబుగారు తెనుగు తల్లి ముద్దులమూట కట్టిస్తున్నారు.

ఇటు విజయవాడ పట్టణంలో మున్సిపల్‌స్కూలు ప్రధానోపాధ్యాయులై, క్రైస్తవ మతస్థులై, అనంత వేదాంతశాస్త్రపరిజ్ఞాన కోవిదులై, భక్తిరసభావభాగ్యవిధాత్రులై, సహజచలోక్తి సౌందర్యశబ్దశక్తిసంపన్నులై శ్రీ యోహాన్ భాగవతారుగారు అనేకంగా హరికథల్ని చెబుతున్నదక్షులై యున్నారు. అనుభవజ్ఞులై యున్నారు.

నరసరావుపేట తాలూకా గుడిపాడు గ్రామకాపురస్థులై, సంగీతవిజ్ఞానకోవిదులై, శ్రీ మహావాది వెంకట సుబ్బయ్య భాగవతారుగారు హరికథల్ని రసభరితంగా, సుందరసుకుమారవాగ్విలాసంతో, మధురమంజులగాన సుధారసతరంగాలతో మహాజనులు ఆనందపరవశులయ్యేట్లు చెబుతున్నారు.

తెనాలివాస్తవ్యులై, ఆర్యవైశ్యవంశరత్నమాణిక్యములై, విశ్వవిజ్ఞానకళ్యాణవాగ్గేయకారకులై, మృదుమధురసంగీత వాఙ్మనోహరమూర్తులై శ్రీ తెల్లాకుల వెంకటేశ్వరగుప్తభాగవతారుగారు రామాయణ భారతాది హరికథల్ని, అమోఘంగా చెబుతున్నారు. నేర్పుతున్నారు.

ఇహ కృష్ణాజిల్లా గుడివాడతాలూకా చౌటపల్లి గ్రామవాస్తవ్యులై, అపూర్వమైన, అఖండమైన, మేధావంతులై, సంగీత చాతుర్యసంపన్నులై కీ॥ శే॥ శ్రీ అట్లూరి వెంకట సుబ్బయ్యచౌదరి భాగవతారుగారు అనేకంగా హరికథల్ని నిరంకుశవాగ్ధాటితో చెప్పి వొప్పించారు.

నెల్లూరుజిల్లావాస్తవ్యులై, మృదుమధురగానతుంబురులై, చక్కనివాగ్విలాసచతురులై శ్రీ కళ్ళే బాలకృష్ణభాగవతారు గారు అనేకంగా హరికథల్ని చెబుతున్నారు.

బెజవాడవాస్తవ్యులై, నాట్యకళోపాసకులై, సరస సంగీత విజ్ఞానధనులై, మృదుమధురంగా, నవరసభరితంగా, శ్రీ గుడిపాటి శ్రీరామమూర్తిభాగవతారుగారు రామాయణ భారతాది హరికథల్ని అమూల్యంగా చెబుతున్నారు.

పిఠాపురవాస్తవ్యులు, హరికథాసుధాపయోధులు శ్రీ బసవ శంకరభాగవతారుగారు. శ్రీ విఘ్నేశ్వరభాగవతారుగారు మృదు మధురంగా, అతిలావణ్యంగా, హరికథా సరస్వతి మంజులవాగ్విలాసాలు, జగజ్జేగీయమానంగా విలసిల్లచేసి వన్నెకెక్కారు.

తరువాత, నాట్యకళోపాసకులై, నాట్యకళాచార్యులై, విరాజిల్లిన శ్రీ మద్దాలి శేషగిరిరావు, శ్రీ దైతాగోపాలంగారూ, అమృతతుల్యంగా, మృదువచోవిపుణతగా హరికథల్ని అప్పుడప్పుడు చెబుతుండెడివారు. వీరిసమకాలికులై, నాట్యకళారాధకులై, శ్రీ చొప్పల్లి సూర్యనారాయణగారు హరికథల్ని అమోఘంగా చెబుతుండెడివారు.

ఇంకా గుడివాడవాస్తవ్యులై, బహుహరికథా బంధువర్గ భాగ్యసంపన్నులై, చక్కని విచక్షణాజ్ఞానసంపన్నులై శ్రీ పార్ల

పల్లి వెంకటనరసారెడ్డిభాగవతారుగారు అనేకంగా హరికథల్ని, ఎంతోమందికి, అన్నవస్త్రాలిచ్చి నేర్పిన పుణ్యమూర్తులు. అప్పుడప్పుడు, స్నేహితుల బలవంతంవల్ల బల్లెక్కి హరికథల్ని అనర్గళ వాచాచాతుర్యంతో చెబుతున్నారు. పూర్వం వీరు రాజ్యాలు వెలిగించిన రెడ్డిరాజులై ఇప్పుడు అంతటా పెత్రుమాకృలైట్లు వెల్గిస్తున్న ఖామందులైయున్నారు.నాకు చక్కని చెలికాండ్రై యున్నారు.

ఐతే విజయవాడకాపురస్తులై,శ్రీ చేపూరి ఆంజనేయభాగవత్రరుగారు లలితంగా మధురంగా హరికథల్ని వ్రాసిచెబుతున్నారు.

బందరువాస్తవ్యులు,వాగ్గేయకారక బిరుదాంకితులు,న్యాయశాస్త్రప్రవీణులు శ్రీ హరి నాగభూషణంగారు రామభక్తాగ్రగణ్యులై మృదుమధురజంత్రగానసుధారసవారాణ్ణిష్ఠులై, దేశమంతటా పాటకచ్చేరీలు చేసి అప్పుడప్పుడు అమూల్యమైన వాగ్విలాసాలతో హరికథాకాలక్షేపాలుచేసి జగత్కీర్తికిరీటాన్ని ధరించారు.

ఇంకోరు బ్ర॥కుప్పా వీరరాఘవశాస్త్రిభాగవతారుగారు రసవంతమైన గానసుధారసతరంగిణీతరంగాలతో, భక్తిపరవశత్వంతో హరికథాకాలక్షేపాలుచేస్తున్నారు.

ఇహ ఈమహామహులందరికంటె చెప్పుకోతగ్గ భాగవతారుగారై, జగమెఱిగినబ్రాహ్మణులై,విశ్వబ్రాహ్మణవంశ మూర్ధన్యులై,హరికథాప్రపంచమత్స్యవల్లభులై, గుడివాడతాలూకా మోతారుగ్రామకాపురస్తులై శ్రీ సింహాద్రి బసవలింగాచార్యులుగారు నేర్చినకథలు రెండైనప్పటికీ, దేశదేశనాయకుల్ని,విశ్వమహాజనమనస్తత్వాల్ని, నాట్యకళాశృంగారభావతరంగాల్నిచలోక్తిగా,మధురోక్తిగా,మధ్యమధ్యపద్యాలతో,భావగేయాలతో రంగరించి మహాజనా

నికి బాగాపట్టిస్తున్నారు. సినిమాలోగూడా మధ్యమధ్యవెళ్లి నటిస్తు న్నారు.వీర్ని మోపర్రువాసుగారంటేగాని యెక్కడాచెలామణికాలేరు. అదివీరికి సార్థకనామమైనది.అట్లాగే వీరు దస్కత్తుచేస్తే బావుంటుం దనిసలహాయిస్తా.యెట్లాగైతేయేం మహాజనానికి యీమోపర్రువాసు గారిమీదవుండే అపేక్ష ఇంకోరిమీదలేదంటే నమ్మండి.అందుకేవీరు కథఒకటింటికి ఐదువందలరూపాయలు తీసుకుంటున్న ఫస్టుక్లాసు డిమాండులోపడ్డారు.వీరు శ్రీ కొమ్ముమ్మారి బాలబ్రహ్మానందభాగవ తారుగారి శిష్యగిరీంద్రం.

ప॥గో॥ఉంగుటూరువాస్తవ్యులై, సరసహరికథాచతురులై, సులలితవాగ్విలాసగానకళాకోవిదులై శ్రీ పెంటపాడు సుబ్బయ్య భాగవతారుగారు జగజ్జేగీయమానంగాహరికథాకాలక్షేపములు చేశారు.

ప॥గో॥ తణుకు వాస్తవ్యులు సంగీతకళాశాలోపాధ్యా యులు, హరికథాప్రవీణులు శ్రీ మేదూరి సూర్యనారాయణ భాగవతారుగారు రామాయణ భారతాది హరికథలెన్నో అమృత వాచాభాగ్యంతో కాలక్షేపాలుచేసి పేర్వాసిగడించారు.

గుడివాడతాలూకా ఎలమర్రువాస్తవ్యులు, అఖండసాహిత్య తపోనిష్ఠాగరిష్ఠులు, మృదుమధుర వాచాపటిష్ఠులు మృత్యుంజయ లింగందేవరగారు అనంతరామాయణ భారత భాగవతాది పురాణ ముల పూర్వంగాచెప్పి హరికథాకాలక్షేపాలుచేసి తెనుఁగు దేశంలో పండువెన్నెలకాచారు.

ఈవిధంగా హరికథాప్రవీణులై, సరససంగీతకళావిశార దులై,శ్రీ తిరునగరి శేషదాసుభాగవతారుగారు.శ్రీ కుంపట్ల సుబ్బా రావుభాగవతారుగారు,శ్రీ నిరంజనరావుభాగవతారుగారు, శ్రీ పుల

ఖండం జానకిరామయ్యభాగవతారుగారు, శ్రీ యెరకయ్యదాసుగారి ప్రధానశిష్యులైన, సాలూరుగ్రామవాస్తవ్యులైన రంగమార్తాండ బిరుదాంకితులైన శ్రీ కందాళ సత్యనారాయణభాగవతారుగారు, శ్రీ పేకిరామమూర్తిభాగవతారుగారు, శ్రీకంచర్ల ఆంజనేయభాగవతారుగారు, కీ॥ శే॥ నారాయణదాసుగారిశిష్యులైన, కాంపిటేషన్ మెడలిష్టులైన శ్రీ చిట్టిమళ్ల రంగయ్యభాగవతారుగారు, శ్రీ కౌలూరి నరసింహదాసుగారు, శ్రీశిష్లా పూర్ణయ్యభాగవతారుగారు మొదలైన జగద్విఖ్యాతహరికథాప్రపంచపురుషోత్తములెందరో హరికథాసుధారసప్రవాహాలు ప్రవహింపచేసి తెనుగుతల్లి బంగారుతండ్రులైనారు.

# తెనుగు తల్లులు

విజయనగరవాస్తవ్యురాలై, సరససంగీతవాగ్విలాసవిశ్వభారతియై, సురువిరసుందరసుకుమార హరికథాప్రపంచసరస్వతియై, అఖండదానకళాకళ్యాణకామధేనువై విరాజిల్లుతున్న శ్రీకళావరింగ్ భాగవతారిణిగారు జగజ్జేగీయమానంగా యావదాంధ్రదేశంలో, సమస్త విద్వత్సభాప్రదేశాలలో భరతనాట్యగానకళాతరంగాలతో, అపూర్వంగా హరికథాకాలక్షేపాలుచేసి తెనుగుతల్లినోములతోట చివురింపచేసి, పుష్పఫలభరితశోభాయమానంగా విరాజిల్లచేస్తున్నారు. యీబంగారుతల్లి కథాకాలక్షేపములు విని భగవత్కథాసుధారస నిమగ్నులైయుండనివారు లేరు; తలవనివారులేరు, తెలియనివారులేరు.

తెనాలి వాస్తవ్యురాలై, యానాదివంశరత్నమాణిక్యమై, మృదుమధురకథావాగ్విలాస గానకళావసంతకోకిలై కొండొక

మహిళామతల్లి అద్వితీయంగా హరికథాకాలక్షేపాలు యావ దాంధ్రదేశంలోచేసి గొప్ప కీర్తిగడిస్తున్నారు.

ఏలూరు వాస్తవ్యురాలై, సులలితగానకథాకళాశిరోమణియై శ్రీ పువ్వుల పుష్పవనం భాగవతారిణిగారు సర్వజనాకర్షణీయంగా సర్వజనామోదముగా హరికథాకాలక్షేపములు చేసి పేర్వాసిగడిస్తున్నారు.

విజయనగరవాస్తవ్యురాలై, సుకుమార కథా గానసుధారస తరంగిణియై శ్రీ నాగమణిభాగవతారిణిగారు హరికథాకాలక్షేపాలు చేసి అఖండమైన యశస్సు గడిస్తున్నారు.

గుంటూరు వాస్తవ్యురాలై, సుందరసుకుమాకకధాగాన విశ్వవిపంచియై శ్రీ డి. ప్రేమావతిభాగవతారిణిగారు అపూర్వమైన అనుభవంతో హరికధా కాలక్షేపాలు చేస్తున్నారు,

విజయవాడవాస్తవ్యురాలై, సరససంగీతవాగ్విలాస రత్నమాణిక్యమై, శ్రీచేవూరి అంజనేయభాగవతారుగారి శిష్యురాలై శ్రీరాజేశ్వరిభాగవతారిణిగారు హరికధాకాలక్షేపాలు అపూర్వంగా అమూల్యంగా చెబుతున్నారు.

ప॥గో॥భీమవరంగ్రామవాస్తవ్యురాలై, శ్రీ బాలబ్రహ్మానందదాసుగారి శిష్యమాణిక్యమై, మృదుమధురగానకధాకళావిశారదయై,సరళంగా,సరసంగా,భక్తిరసతరంగంగా,శ్రీ పెండ్యాల సుందరమ్మభాగవతారిణిగారు హరికథాకాలక్షేపాలు చేసి కోమలమైన యశస్సు గడిస్తున్నారు.

ఇట్లా తెనుగుతల్లులెందరో హరికథాగానభరతనాట్యకాలక్షేపాలుచేసి తెనుగుతల్లి ముద్దులమూటకట్టిస్తున్నారు.

ఈ హరికథా బృందావనచక్రవర్తులు బహువిధ శక్తి సామర్థ్యాలు సంపాదించి, ప్రసాదిస్తున్న ప్రసన్నవిజ్ఞానభాగ్యాలు ప్రజాజీవితాలకు పారిజాతాలు. విశ్వమహాజన మనస్తత్వాలు బాగా గుర్తించి, భగవత్కథాసుధారసతరంగాలలో, సమన్వయ జ్ఞానభాగ్యంతో దేలించి, మానవజన్మకి కావలసిన ఐక్యత, యోగ్యత, బాధ్యత చూపించటానికి ప్రధానంగా హరికథ ప్రచారం ముఖ్యంగా జరగాలి.

హరికథ, వున్నదున్నట్లుగా బిగించివున్న చట్రంలోంచి తీసి, వొప్పగిస్తే, మహాజన హృదయంలో రసంచిప్పిలదు. పద్యాల్నిపట్టుకొని, పెడరెక్కలు విఱిచిచూపిస్తే రసోదయం కాదు. గద్యాన్ని తూచా తప్పకుండా వల్లించి జల్లిస్తే రస వాహిని జనన్మోహినికాదు. కంఠస్తంచేసిన శ్లోకాల్ని మధ్య మధ్య జాడిస్తే, ఆనందరసవారాణ్ణిధి ఘూర్ణిల్లదు, భట్టీపట్టిన భట్టివిక్రమార్కునికాలంనాటి పుక్కిటి పురాణాలను, దీపావళీపం డుగబాణాసంచాల్లే ప్రయోగిస్తున్నగూడా రసగంగాధరుడు సాక్షా త్కారంకాదు. దబాయించి, లగాయించి, సంగీతాలు సైరనల్లే సాగిస్తే కథాప్రభాతలక్ష్మి నవరత్నవిభూషితాంగికాదు. చుట్టూతా జోరీగలల్లే తొంభైవాయిద్యాలుముసిరి, కసరి, మద్దత్తిస్తుంటే, కథాయోధుడికి, గుండెధైర్యంరాదు. అసలు ఇవన్నీ సహజ పాండిత్యం లేనివాడు తెచ్చిపెట్టుకుంటున్న సరంజామ.

అసలు హరికథావతారమూర్తి భువనమోహనమూర్తిగా, ముద్దులమూటకట్టేటుగా కనబడాలి. అతని వదనారవిందం మక రందాలొలికిస్తున్న చిరునవ్వుకిరణాలు విరజిమ్ముతుండాలి. అటు వంటిదివ్యమంగళస్వరూపుడై, సౌందర్యోపాసకుడై, అభినయ

దివ్య నాట్యకళాప్రపూర్ణుడై, గంభీరవాగ్ధారాధరుడై కనిపించాలి. సమయస్ఫూర్తిగా, సందర్భానుసారంగా, పాత్రౌచితీభాగ్యంగా, మంజులవాగ్విలాసాలు కులికించాలి. అరిలోకభీకరుడైనవాని, గంభీరవాక్కు జలదగంభీరగర్జనగా రప్పించాలి. కుసుమకోమలి సుకుమారప్రసూనవాక్కుల్ని శుభసుందర వజ్రమాణిక్యాలుగా విరాజిల్లజేయాలి. మొత్తంమీద కథలోవస్తున్న, ప్రతిపాత్రతీరు జోరు జగన్మనోహరంగా చూపాలి. ఏయేపాత్రకి ఎంతెంతమాట బిగువుగా, లగువుగా వాడాలో విచక్షణాదృష్టితో, తూచి, చూచి, మాట్లాడాలి. అంతేగాని, అనవసరంగా, చిక్కిరి బిక్కిరిగా శబ్దజాలాన్ని మహారణ్యంగా పెంచకూడదు. సంగీతదార్ఢ్యంతో పెద్దగామాయై పద్యాన్ని, గేయాన్ని, పెడతెక్కలు విరచి, తమ వెంట తన్నుకొని, సంగీత నక్షత్రమండలవిహారంచేస్తూ, కథా సంసారాన్ని గందరగోళంపెట్టకూడదు. సంగీతాన్ని, కథాసాహిత్యాన్ని బహుపొదుపుగా వాడుతుండాలి. మాటకారిగావుండాలి. చమత్కారిగావుండాలి. అంతేగాని వికారిగావుంటేమాత్రం సహించలేరు. రుబ్బుడుపాత్రంగా తలనున్నగాకొట్టించుకొచ్చి, విభూతి రేఖల్ని, పంగనామాల్ని బాగాపట్టించుకొచ్చి కథలో అభినయించి, సత్యభామఅలక యేంచూపించగలుగుతారు? సీతామ్మవారి చిన్నారి చిరునవ్వుమోము, శ్రీరామచంద్రచక్రవర్తికెట్లా చూపించగలుగుతారు? అంటే కథకుడైనవాడు ఎవ్వరెడీ యాక్టరుగా తయారయ్యేపోజులో వుండాలి. దాని సౌందర్యభాగ్యానికి బదులు యిట్లా, నున్నగా ఎప్పటికప్పుడు, తలకొట్టించుకొని, శుద్ధశ్రోత్రీయంగావుంటే చూపించాల్సినఔచిత్యాలకి ఎట్లాపనికొస్తారు? నల్గురులో బుద్ధిమంతుడనిపించుకుంటానిగ్గాను శిబ్బిరేకుజుటుతోనూ,

వసారాజుట్టుతోనూ తయారుకాకూడదు. తమప్రక్కవారి నోటి నుంచి "తలలు బోడులైన" "తలపులు బోడులా" అన్నమాటని కదిలించేట్టుండగూడదు. చెప్పేముక్కలు నాలుగూ వినసొంపుగా వుండాలిగాని, యీ అంపచందాలెట్టావుంచేయేంలెద్దూ అని, వట్టి రాచిప్పగోత్రంలో పడకూడదు. పోకచక్కలు బాగావుండి తమల పాకులుక్రుళ్లువైతే యేం ప్రయోజనం? రెండూపసందైనవైతేనే నోరుబాగుంటుంది. జోరుగావుంటుంది. అంచేతనే వేష భాషలనేమాటలో మొదటచెప్పిన వేషాన్ని కథకులైనవారు బాగా భావించుకొని, విమర్శించుకొని సరిచూచుకోవాలి.

హరికథా ప్రపంచపరమేశ్వరులైన శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారి అవ్యాజప్రేమాభిషేకానికి పాత్రులై, సౌం దర్యవసంతులై, చక్కచక్కని మంజులవాగ్విలాసకథామనో హరచక్రవర్తులై, కీ॥ శే॥ బంకా బాలకృష్ణభాగవతారుగారు అతి లావణ్యంగా, శ్రవణసౌఖ్యంగా, స్ఫుటమైన వాచాచాతుర్యంతో, హరికథాగానకళావిలాసాలు కులికిస్తుండేవారు. సామాన్యంగా ఎవరి నోటికీ, ధాటికీ, అలవిగాని అచ్చతెనుగుభాషాకౌశలం ఒకానొక నాడు. బ్రహ్మశ్రీ వ్యాకరణశాస్త్రపరిమేష్టియైన కీ॥ శే॥ తాతా రాయుడుశాస్త్రిగారు శ్రీ నారాయణదాసుగారు మొదలుగాగల నిండు పండితవేదండమండలం వున్న సభాసమావేశంలో అత్యద్భుతంగా ప్రదర్శించి ఆశ్చర్యచకితుల్ని చేసినట్టి జగాజెట్టైనవారు.

నాకు సంగీతంలో సత్తావుందని, గొంతుచించుకొని, గంతులేస్తే పప్పులుడకవు. దానికి తగ్గతూకంగా, సాహిత్యపుష్టి వుండాలి. సాహిత్యంలో నేనుచూడాల్సినవి ఇకేమీలేవని,

తొమ్మ విరచుకొని తిరిగితే, నాకోసం జనం విరగబడదు. దానికి తగ్గట్టే సంగీతం సరళంగా సంపాదించాలి. సంగీత సాహిత్యాలు రెండూ, నాదగ్గరున్నాయని అఘాయిత్యంతో డబ్బా వాయిస్తే సరిపోదు. దానికితగ్గ స్ఫురద్రూపం, స్ఫుటమైనవాక్కు; గంభీరగళం, అభినయభావలయాదులు అమోఘంగా తెచ్చిపెట్టుకోవాలి. ఇన్నీ భర్తీచేసుకొని, సమయస్ఫూర్తిలేకపోయిన, చమత్కారం హుళక్కైన లాభంలేదు. ఇవన్నీ ఎట్లాగోఅట్లా నాలో వచ్చిపడ్డాయనుకొని, కాలికి గజ్జెకడితేకాదు. వెన్నపూసవంటిమనస్సు గంభీరవిశాలహృదయం, అప్రతిహతమైన సమన్వయజ్ఞానం, అఖండ ప్రపంచపరిజ్ఞానం, అనివార్య శౌర్యసాహసం, భగవద్భక్తి సుధారసం నిండుగావుండి భోగరాజుకావాలి. త్యాగరాజు కావాలి. విశ్వజన శ్రేయోభిలాషతో దేనికి జంకకూడదు. మిన్ను విరిగి మీదపడ్డగూడా బొంకకూడదు. అంత సద్గుణగణలక్షణ లక్షితులైనవారే నిఖార్సైన భాగవతారు లౌతారని నేను గ్రహించి బల్లెక్కితే భాగవతారుగా చలామణౌతాను. లేకపోతే ఎంగిలి సరుక్కి సిద్ధమైన ఖాతాదారుడుగా తయారౌతాను. అందుచేత ఇటీవల నేను హరికథాశక్తిసంపన్నులైన భాగవతారుల సాన్నిధ్యంలోపడి నాక్కావలసిన హరికథాసామగ్రి కొత్తకొత్త సంపాదించుకుంటున్నాను. ఈ హరికథాప్రవీణులలో రసికజన మనోభిరాములై మందారమకరంద వాచామాధుర్య మంజులగాన కళాచాతుర్యకథాసుధాంబుధులై నన్ను తనిపించిన శ్రీ కొమ్మూరి బాలబ్రహ్మానంద భాగవతారుగారికి నా కృతజ్ఞతాంజలితో నా పావురాలకావ్యాన్ని బ్రహ్మానందభరితుణ్ణై అంకితం యిచ్చాను.

వారి సమకాలికులై, సమతుల్యులై మెఱసిన భాగవతారులందరూ నా కావ్యకన్యని ఆదరించి, దానికవితాభక్తికిరణాలు మహాజన హృదయశయ్యలపై పవళించిన బ్రహ్మాండభర్తకి అభిషేకిస్తుంటారని హృదయపూర్వకంగా మురిసి ముద్దుముద్దుగా వేడుకొంటున్నాను.

నేను రచించిన ఈ పావురాలకావ్యోదయానికి కబీరుదాసులై ఉపదేశించి, ప్రోత్సహించి కొనసాగజేసిన శ్రీ బొండాడ నరసింహశ్రేష్ఠిగారికి నా శతసహస్రకోటిభక్తికిరణాల్ని సమస్కారాలతో సమర్పించుకొంటున్నా.

నాకు ఇటువంటి వజ్రాలపంట సంప్రాప్తించటానికి, ఇంతటి హరికథావిధాతృలతో పరిచయభాగ్యంకలిగించి, నన్ను అల్లారుముద్దుగా, పుత్రవాత్సల్యంగా, కడుపారప్రేమతో పోషించుకొని నా యీ చిన్నారిపావురాలకవితాకుమారికిభువనమోహనమూర్తిగా విరాజిల్లుతున్న శ్రీకొమ్మూరి బాలబ్రహ్మనందభాగవతారుగార్ని కృతిభర్తగామాట్లాడి, కుదిర్చి నాకవితాకుమారి నోములతోట చిగిర్చేట్టుగా బంగారువర్షంకురిపించి నన్ను కృతార్థునిచేసిన, రాయలువంటి శ్రీ బంకా రాములుపాత్రుడుగారికి నా హృదయపూర్వకమైన భక్తిసుధాంజలితో నా వజ్రాలపువ్వులు సమర్పించి నమస్కరించుకొంటున్నాను. శ్రీ కనకదుర్గాదేవి, శ్రీ మహాదేవుడు నన్నాదరించి, ప్రోత్సహిస్తున్న యీ రాయలువంటి రాములవారికి యీ విద్వజ్జనశేఖరులకు, యీ భాగవతోత్తములకు, యీకృతికన్యాపరిణేతలకు, నాకు, నాకుటుంబమునకు, విశ్వ మహాజనానికి అఖిలైశ్వర్య ఆయురారోగ్యభాగ్యాల్ని ప్రసాదించుగాక యని ప్రార్థించుకొంటున్నాను.

—వే దాం త క వి.

# పట్టాభిషేకం.

కొమ్మలు చక్కఁగాఁ బసుపుకుంకపుగుమ్మము
గుల్కఁ జేసి, ద్వా
రమ్ములు పచ్చతోరణములరాశిలు తేజము
లొల్కఁ బోసి. చి
ట్టెమ్మ వరాలనోము ప్రకటించి, ఫల
మ్మొనరించి, బాలబ్ర
హ్మమ్మునొసంగె పుత్రమణిహర్మ్యముతో
విలసిల్లునట్లుగా॥

ధీరోదాత్తుఁడు శాంతచిత్తుఁడు, మహో
దేదీప్యమానప్రభో
ధారామోత్సవ విశ్వసుందరకళాధ్యక్షుం డ
నంతుండు, త
ద్వీరబ్రహ్మ కథాసుధార్ణవ తపోవిజ్ఞాన
తేజో విశే
షారాధ్యుండయి నిన్ను గాంచె నిల
బ్రహ్మానంద భాగ్యమ్ముగా॥

## కృతికన్యా పరిణేత



హరికథా సుధార్ణవ, కథా పరమేశ్వర, సువర్ణ ఘంటా
కంకణ గండపెండేర, నవరత్న కోటీర కేయూర
బహుమాన విభూషితులు బ్ర. శ్రీ కొమ్మూరి
బాలబ్రహ్మానంద భాగవతారుగారు.

## పట్టాభిషేకం

ఏనెల బాలుండై, బ్ర
హ్మానందుండై, వినూత్న మార్కండేయుం
డై, నా కీ బాల బ్ర
హ్మానంద సునామధేయుఁ డర్హుండు సుమా ॥

మే సుపొంగెడి మేలిమొల్కనగవుల్ మెక్కించు మా బాల బ్ర
హ్మానందంబును గాంచనేరని సరవ్యాఘ్రంబు లోకాన లే
దేనాడైనను తద్వచోమృదుకథాహేలాకళామాధురీ
గానంబుల్ కవనంబు లప్సరసలై కవ్వించి నవ్వించురా ॥

నిక్కచ్చైన నిజాయితీకథకుఁడై నిర్నిద్ర వాగ్ధాటిచే
వక్కాణించెడి దాసు గాని, మఱి డబ్బాక్లాసు గాఁడేమి, యే
చిక్కుల్ వచ్చిన, రొక్క మెంతయిన, పేచీ లెన్నిమార్గాన్న, మేల్
వాక్కేమాత్రము మొక్కపో దెపుడు బాలబ్రహ్మజన్మంబులో ॥

నాఁడుం నేఁడును పెక్కు భాగవతులెన్నం భోగియై త్యాగియై
తోడావేసి, కిరీటధారియయి, ముద్దుల్ మూటగట్టించగా
పాడెం బాటలు, గిట్టనట్టి బధిరప్రజ్ఞావళీప్రాణముల్
తోడెం, గొమ్మురి బాలబ్రహ్మ జయసూక్తుల్ మా భుజాస్ఫాలనల్ ॥

కథకుండెవ్వడు కాలుద్రవ్వినను వాగ్ధారాధరుండౌను,భూ
రథమున్ సర్వసుపర్వకోటిఘనసంరంభంబుగా నెక్కి వేల్
కథలన్ వీనులవిందుగా వినును,బాలబ్రహ్మవాగ్వార్ధిలో
మథనన్;మూర్ఖుడెవండు గైకొనడు బ్రహ్మానందమాణిక్యముల్?

నడుముబిగించి సద్ధాసలి
గడగడలాడించు మేఘగర్జనతో,చూ
కెడి శ్రీనారాయణ దా
సుఁడు బాలబ్రహ్మకిచ్చె సుషమాశిషముల్ ॥

అంతటి వాగ్విలాసపరమాత్ముఁడు మెచ్చిన బాలబ్రహ్మ ధీ
మంతుడు కాదటంచనెడిమాట చెలామణియౌనె?కంటిలో
నింతటి పాప నల్లనని యెవ్వ డసూయగతీయనట్లు సి
ద్ధాంతముజేసి చెప్పితి,యథార్థము నైపనిమాపులున్నచో ॥

వేదపురాణశాస్త్రజయభేరిని గొట్టి,కవిత్వతత్వ స
మ్మోద సహస్రగ్రంథములు మోపులుగా రచియించిపెట్టి సం
పాదనలోని కోట్లు తృణప్రాయముగా మరి ఖర్చుపెట్టి శ్రీ
పాద గురుండొసంగిన కృపారసవిద్యలు బ్రహ్మకబ్బెరా ॥

శ్రీపాద కృష్ణ గురుఁడిల
ద్వైపాయనుడౌచు హరికథానిధులిడగా
ఆపాదమస్తకమ్ములు
కాపాడెడి పసిఁడి బాలబ్రహ్మకైకానెనుకదా ॥

కిటుకులుచక్కగా తెలిసి కింకవిదిగ్గజసింహమౌచు ది
క్తటములు పిక్కటిల్లెడి యఖండవచోవిభవైకశౌర్య శ్రీ
పటిమ శతావధానములు బాగుగజేసిన, చెళ్ళపిళ్ల వేం
కటకవి బాలబ్రహ్మ ఘనకౌశలమున్ గొనియాడె గొప్పగా॥

బాలబ్రహ్మానందము
కాలక్షేపములులేని గ్రామముగలదే ?
ఆ లక్షలార్జనలతో
చాలా ధర్మాలు సేయు చాగియు గలండే ?

ఏనుగు నెన్నియోతడవలెక్కి కథాచతురోక్తి కీర్తిచే
గానుగలాడియాడి ప్రతిగ్రామము భక్తిరసానదేల్చి, మే
ధానిపుణుండుగా హరికథారసపాకములెల్లజేసి, లో
కానికి బాలబ్రహ్మ శుభగంబుగజేసెను విందులెన్నియో॥

# పట్టాభిషేకం

భాగవతారులింక ప్రతిభాగతిభాసురులై మహాకథా
సాగరులై, జయధ్వజము చక్కగనెత్తిరి గాని, యీ మహా
వాగనుశాసనాదికవివల్లభులందరు మెచ్చ డిమ్మహా
యోగము పట్టినట్టి బుధుడొక్కడు లేడుగ బాలబ్రహ్మగా॥

కొందఱు కథలో పూర్ణా । నందము కల్గించియున్న నల్గురి పరమా
నందమొనర్చిన, బ్రహ్మ । నందములో సొగసు దెచ్చిన ఘనుండేడీ ?

చిఱునవ్వు తొల్కరి మెఱుపుతీగె పడంతి
మెఱుగులు పరుగులు చెఱుగువాడు
చక్కచక్కనిమాట చక్కిలిగిలిపిల్ల
హొయలు లయలు బట్టబయలువాడు
ప్రక్కకొండల చక్రవర్తి యెదుఱుబొమ్మ
పగులు దిగులు సూపు వాక్కువాడు
కమ్మకమ్మనినోట గండుకోయిలపాట
జిలుగులు కులుకులు కొలుచువాడు

హరికథా పరమేశ్వరుడైనవాడు
నేను నీవన్న భేదమ్ము లేనివాడు
దీనజనులకెల్ల విధేయుడైనవాడు
అతని బాలబ్రహ్మనందు డందురమ్మా ॥

అడుగో అడుగో అడుగో
అడు గడుగో పావురాల నడిగినవాడే
తడబడకే [illegible]ుగొనవే
బిడియము దేనికి వరాల పెండ్లిచెలాకీ॥

కృతికన్యాపరిణేతవై, హారికధాకేయూర, కోటీర గి
ష్పతివై, దిగ్గజనాగ్యభామినులతో బంగారుముత్యాల హా
రములన్గైకొని, ఆదిభట్ట కవితాప్రావీణ్యలావణ్య శౌ
ర్యపురాషాట్టుగ బాలబ్రహ్మ! ఘనకీర్త్యాయుర్ధనం బేలుమా ॥

ఏ మేటివారి నచ్చక
నీ మోజు రివాజగుచు తృణీకృతవిభుడై
సామోజు సుబ్బరావిల
నీ మహిమలు బాలబ్రహ్మ నిరతము జెప్పెన్ ॥

విశ్వాసపాత్రుడిల, కో
టీశ్వరు డవ్వాని తమ్ముడింకెన్నెన్నో
యీశ్వరసాక్షిగ జెప్పెను
విశ్వబ్రాహ్మణయశోడవిణ! నీమహిమల్ ॥

ఆ యసలైనమిత్రుల దయాకిరణమ్ముగాలెకాదు,సత్కవుల్
గాయకరత్నముల్,నిఖిలకౌశలులౌకథకుల్ సమస్త వి
ద్యాయుగకర్తలెల్ల కొనియాడెడి రాయలువంటి రాముకే
నీ యశమున్ కనుంగొని గణించి వచించెను బాలబ్రహ్మమా॥

అక్కటతమున కాబోలును
చక్కని నా కావ్యకన్య చాలాతడవుల్
మక్కువతో నీ దిక్కున
కెక్కువగా చూడసాగె నేదో బ్రహ్మ॥

గిలగొట్టితివా వలపుల్?
నిలపెట్టితివా తపించి నిర్జనసీమన్ ?
తలపెట్టి పెండ్లిలగ్నము
బలవంతము వెట్టినావ? బాలబ్రహ్మ॥

కట్నాలా? నా కుండిన
పట్నాలే వ్రాసియిత్తు బాలబ్రహ్మ.!
పట్నాలవారు మీలో
కట్నాలకు పోటిరాని కైవడి కనుమీ॥

మీ దివాణమునిండ మేలిమిగలఛాయ
మా దివాణంబో న్నమశ్శివాయ
మీ దేవిడీపూలు భూదేవిరత్నాలు
మాదేవిడీ లేవిడీదళాలు
మీ కోటగుమ్మాలు మేల్కొల్పు మేళాలు
మా కోటగుమ్మాలు మంతనాలు
మీ వ్యవహారాలు మెఱుగైన వరహాలు
మా వ్యవహారాలు స్మారకాలు

మీ విలాసాలు గాన సమ్మేళనాలు
మా విలాసాలు కపనాల మందిరాలు
మీరు మాకు బ్రహ్మానంద గౌరవాలు
మేము మీకు నీనాములైనాము బ్రహ్మ ॥

సహాయించి రెండువిధములు
మహా మామిడికన్న జీడిమామిడి మిన్నై
గ్రహాయించబడ్డచందము
రహా బ్రాహ్మణుకంటె . విశ్వబ్రాహ్మణుగొల్తున్ ॥

నీ జాతికి, నీ ఖ్యాతికి
నా జాజిది జార్జిరాణి నాజూకులతో
పూజాంజలి గొనితెచ్చెను
బాజా లిక తెమ్ము లెమ్ము బాలబ్రహ్మ ॥

అల్పముగాని నా కవన మక్షరలక్షలు సేయు విల్వతో,
గల్పితి చిట్టిచంపతులుగా మిము పట్టుతివాసిపై న, సం
కల్పము కల్పవృక్షమయి కాపుర మే పురమైననేమి ? యీ
శిల్పము రక్షకుం డతికె నైక్కు చెఱుంగదు బాలబ్రహ్మమా ॥

నీవు చమత్కారివిలే .
మా విఱజాజిది భలే చమత్కారిణిలే
పూవులతో కాయలతో
యీ వెన్నెల తిన్నెలన్ని యేలుదు బ్రహ్మా॥

ముదివగ్గయిన బమ్మ మోపైనందగ్గుతో
నిల్లాలికిల చిప్ప నిచ్చినాడు
అవతారములనెత్తి యలసి విసిగి విష్ణు
పడతి నెల్లర కింక విడచినాడు
ఆలిబిడ్డలపోరు లణచలేక శివుండు
జంగమయి విషమ్ము మ్రింగినాడు
మీసాలుత్రిప్పి యాయాసాలతో రాజు
భూదేవి బ్రజ కిచ్చి పోయినాడు

ఆ త్రిభువనైక రక్షకులైనవారి
కాపురములు మోపురములు గోపురములు
తిరిగిచూడుము కొమ్మలు విరిగిపోయె
భద్రముగనేలు కొమ్మారి బాలబ్రహ్మ ॥

## ప ట్టా భి షే కం

శ్రీగుణవల్లి మేలిపువురేకుల సీతమతల్లి బాలబ్ర
హ్మాగమ చాతురీ హరికథాలయ మంజులగానమాధురీ
త్యాగకళాపురంధ్రియయి తావకమోహనమూర్తిభాగ్యముల్
ప్రోగులుపోసి కొల్చె నగుమోమువరాలను కావ్యకన్యకా ॥

అనసూయాత్మజ కాపురంబునకు
బ్రహ్మానందుడో, రామ బ్ర
హ్మను జామాతగ గాంచినందులకు
బ్రహ్మానందుడో, విశ్వ బ్ర
హ్మను నిర్జించెడి పుత్రరత్నమయి
విద్యాసాగరుండింత, మో
హనమైనందుకు బాలబ్రహ్మ మరి
బ్రహ్మానందుడో చూడుడీ॥

ఆయుష్మంతులుగా, ల
క్ష్మీ యోగావిర్భవైక శ్రీమంతులుగా
శ్రేయోవంతులుగా, దు
ర్గా! యీబ్రహ్మల సతమ్ము గాపాడగదే॥

ఆంధ్ర "బెర్నార్డ్‌షా"
వే దాం త క వి
కవితా సంస్థానము.

# పా వు రా లు

దొరలయి రమ్యహర్మ్యము వధూజన
సౌఖ్యము వీడలేని భూ
వరులనుఁగూడ లేపి నిజపాద
సరోరుహ భాగ్యమిచ్చు శ్రీ
తిరుపతి వెంకటేశ్వరుని దివ్య
ప్రసాదము వెట్టినట్టి వి
స్తరినయి పాండురంగ! కవితారస
పాకములన్ని జూపెదన్

సురుచిరమైన యీ యుదయ సుందరి
చక్కని కొండెచుట్టు కి
న్నిరకరకమ్ములైన కమనీయ కళా
కుసుమమ్ము లెప్పుడ
చ్చెరువుగ గ్రుచ్చి యప్సరసఁజేసి
సుతారముగా సృజించితో
ధరపయి పాండురంగ! సరదా
పడిరండు దాని కుల్కుతోన్॥

మెల్లగ పక్షిగ్రుడ్డులకు మెత్తని
మేలిమి కుంచెతోడ రం
జిల్లెడి యిన్ని మేలినగిషీ పను
లెప్పుడు దిద్దినాడవో
కొల్లగ, కోటివర్షములకుం
తనువేమియు మాసిపోక శి-
థిల్లెను పాండురంగ! మురిపించెడి
పిట్టలు పట్టు తెక్కలన్॥

ఈ హిమబిందు సుందరి మహీస్థలి
రత్నవిభూషితాంగియై
మోహకళల్ ప్రఫుల్ల సుమమోహిని
తళ్కుహొయల్ దిగంత ప్రో
త్సాహముగొల్ప గుల్కెనది; తావక
శిల్పకళావిలేఖినీ
వ్యూహము పాండురంగ! మునుముందు
కనుంగొను దిట్ట పుట్టునా?

చతురులు, శిల్పు లిట్లనిమిషత్వముతోఁ
దిలకించుచుండ సు
న్నితమయినట్టి నీ యులిపనిం నగిషీ
పను లెన్నియో మహా
ద్భుతముగ మొల్చుచుం శిలలు ముచ్చటగా
మణులయ్యె; విశ్వభా
రతికళ పాండురంగ! మృదురాగ
సుధారసమందుఁ దేల్చవా?

వరుసగ గ్రుడ్లుచిట్లి కడు వన్నెలు
చిన్నెలు మొక్కవోని మా
దిరి చెలువైన మేనుల కుదింపు
బహిర్గతమై, ధరిత్రిపై
పరుగిడు కోడిపిల్లలకు పాఠము
లెప్పుడు నేర్పుకొంటివో!
విరతము పాండురంగ! పయనించె
నిజోదర పోషణార్థమై॥

గమ్ముగ మంతిరించి మయికమ్మిడి
యీ తొలికోడి గొంతులో
నిమ్మయి నీ'వలారము' మతెన్నడు
వెట్టితివో! సమస్త వి
శ్వమ్మును మేలుకొల్పె; నిటువంటి
మహాద్భుత మాంత్రికుండు ని
క్కమ్ముగ పాండురంగ! త్రిజగమ్మున
లేదనిపించుకొంటివా?

భారము నిర్విరామముగ పైఁబడి
మోసెడి యింత విశ్వ సం
సారముతో సదా విసిగి చాల
చిరాకు పరాకుతోడ బే
జారయి పోవుచుంటి; నిముసమ్ము
మదీయ కుటీరమందు విం
దారసి పాండురంగ! కడు హాయిగ
స్థాయిగ విశ్రమించుమీ॥

నీదయ దివ్యనందన ధునీ రస
వాహిని పాయపాయ లై
వేడజగద్ధితంబులయి, వేసవి
కోయిల యీలపాట లై
పేదకుటీరమార్గ పరివేష్టిత
కల్పమహీరుహంబు లై
మేదిని పాండురంగ! ప్రణమిల్లగఁ
జేసె సమస్త జీవులన్॥

పలుచని తోలుఁడొక్కలకు వారు
బిగించి మనోహరంబుగా
కులికెడి శబ్దలక్ష్మి పరుగుల్
మెఱుగుల్ కొలబోసి దివ్య గా
నలహరి తూగుటుయ్యెల ఘనంబుగ
నూగెడివాడ వీవు; నీ
చలువకు పాండురంగ! శతజన్మల
మోదు చిగిర్పకుండునా?

తుమ్మల తోపులో పసుల(ద్రోలి
పసందుగ వేణుగాన రా
గమ్ము చిటారు కొమ్మపయి కమ్మగ
దీసి మహానదీ ప్రవా
హమ్ములు పొంగజేసెడి మహాత్మ్యము
నీ చిఱుబొజ్జలో సుతా
రమ్ముగ పాడురంగ! తనరంగ
మృదంగ తరంగ మయ్యెరా!

నా నిఱుపేద భక్తికిరణాలకు
నీ చరణాలు దక్కునా?
శ్రీ నిలయమ్ములోన నివసించి
సుఖించి తరించిపోచు పూ
పానుపుపైన మైమఱపు వచ్చెడిదాక
పరున్నవేళ, నా
దీనత పాండురంగ! కడ(దేర్చెడి
మెలుకువ నీకు వచ్చునా?

మండెడి యెండలో చిగురు మామిడి
చెట్టుగ నీవు కానరా
కుందిన 'కావు కావు' మనుచుండెద
కాకిగ; నీ కటాక్ష మె
న్నండు లభించి నీ మధురనామము
కోయిలగా స్మరించి నీ
యండను పాండురంగ! కవితామృత
వాహిని పొంగజేతునో!

కుందుచు నీ యనుగ్రహము కోసము
వచ్చిన వాడఁగాని, నీ
సుందరమైన విగ్రహము నూచి యులూచి
ఘృతాచి గోపికా
బృంద మరీచివోలె పులిపించగ
వచ్చిన వాడఁగాను; నీ
వందుకు పాండురంగ! నిలయాన
తయారయి కుల్కబోకుమీ॥

నీవు మహాసముద్రుఁడవు; నేను
త్వదీయ కృపారసమ్ము భూ
దేవికిఁ దెచ్చు మేఘుఁడను; దీనికి
దేశములన్ని సాక్షి; రా
జీవ దళాయతాక్షుఁడవు; చేసిన
సేవలు నీవు చూచుకో
లేవుర? పాండురంగ! పడలేనుర
దూకులు దూకి తిట్టుచో!

త్రొక్కిన జాతి వైతివిర! దోయలి
నొగ్గి భవత్పదాబ్జముల్
మ్రొక్కిన వేల్పువైతివిర! ముజ్జగముల్
కని, మోయుచున్న నీ
కెక్కడనుంచి వచ్చినవొ యింతటి
శాంత గుణమ్ము లీ కృపా
దృక్కులు! పాండురంగ! వరియించెద
వాటి ననుగ్రహింతువా?

బేళ్లకు బేళ్లు నీకథలు పెర్గి
ప్రియమ్మయిపోవుచుండె ! ఎ
న్నాళ్లకి గూడ చౌకగ జనానికి
నీ ధర తగ్గదేమిటో !
ఊళ్లకవెంత తియ్యని మయూఖ
కథా కవితా సుధారసం
బేళ్లయి పాండురంగ ! ప్రవహించి
కుదించి ముదాబ్ధి ముంచెనో !

ఈ సుమనోభిరామ భువనైక
మనోజ్ఞ వినూత్న రత్న సిం
హాసన మెక్కఁబోవు సమయంబున
స్వార్థరథమ్ము ద్రిప్పి స
న్యాసిగ ఘోరమైన గహనాలకుఁ
బోయిన నీయవస్థ చూ
చేసుమి పాండురంగ ! శిలలేడ్చెను ;
కోతులు యేడ్వకుండునా ?

భూవలయాన నీ కెదురుపోయి
జయించినవాఁడు లేడు ; మా
జీవిత సస్యలక్ష్మి విలసిల్లఁగఁ
జేయుట కీ వఖండ గో
దావరివంటివాడవు గదా ! యిక
నీ దయమైన చల్లగా
కావగ పాండురంగ ! సరిగా
హరిదాసుల నోట జారనీ....

నిను కనిపెట్టుచుండుటకు నీ
యరిభీకరమైన మేఘ గ
ర్జన లిలపై సివంగులు ఫిరంగులుగా
దుమికించి దూకుచుం
డిన లయకాల రుద్రుఁడవు ; నీకు
దయారస మెక్కడున్నదో
ఘనముగ పాండురంగ ! త్రిజగమ్ము
సుధారసవృష్టి ముంతువా ?

నీ కమనీయదేహ రమణీయత
లే ఘన గేహసీమలో
రేకలు విచ్చి చక్కని చరిత్ర
ధరిత్రికి నందనంబులై
నాకధరా పురంధ్రి భవనాలకు
మంగళ తోరణంబులై
ప్రాకెనొ పాండురంగ ! నవరత్న
కళాకిరణాలు కుల్కరా॥

చక్కని పూలమొక్కలకు చక్కిలి
గింతలుపెట్టి తోటలో
ఫక్కన నవ్వు పువ్వులను పట్టము
కట్టుకొనంగబోవు నీ
మక్కువ మోదుపైన నణుమాత్రముఁ
గూడ మఱల్పకుండినం
బ్రొక్కెద పాండురంగ ! వనమూలికనై
భవరోగశాలలో....

రంగులు మార్చివైచెఁ గదరా
తెరకెక్కిన బొమ్మలన్ని : నీ
బంగరు కుంచెతో కులికివచ్చిన
చక్కని వాలకాలలో
దొంగతనాలు,దుర్మదపు ధూర్త
గుణాలు,మహాద్భుతాలు డా
గెం గద పాండురంగ ! తిలకింతువా
లేదా మనుష్యనాటకాల్ !

పిచ్చుక గూండ్లు చిన్ని పసిపిల్లలు
కట్టెడురీతి నీవు బల్
ముచ్చటగా సృజించితివి భూజన
భోజనశాల లెన్నియో ;
అచ్చెరువొందఁజేసెడి మహాద్భుత
తావక సృష్టిఁగూడ నేఁ
డిచ్చట పాండురంగ ! పడియేడ్వని
చల్లనిచోట నిచ్చుమీ॥

తీయనితీపి నీ దయకు తేటలుగట్టి
జగద్ధితంబుగాఁ
జేయు మహోపకారమున చీమలు వట్టిన
వాడవై గదా
కాయములేక కాపురసుఖంబులు లేక
నిరంజనుండవై
మాయగ పాండురంగ ! అనుమానముగా
కనుపించకుంటివా ?

ఇరువది యేండ్లనుంచి తనువెల్ల వ్యయించి
స్వదేశమాతకై
కరగి జగాన కాలువలుఁగట్టిన నా కవితా
కుమారి ది
క్కరసినవారు లేరు ;తుద కక్కట !నిల్వగ
నీడ లేదు ; నీ
పురమున పాఁడురంగ !పది మొల్వగ
బెత్తెడు నేల దక్కునా ?

నీ మురళీప్రవాహం రమణీయ
తరంగము లెంత కోకిల
స్వామి వసంతకాల వనశాలలలో
వడగట్టె నీ కళా
సీమలు పుణ్యతీర్థములుఁ జేసినఁగూడ
త్వదీయ రాజ్య ల
క్ష్మిమణి పాండురంగ! తిలకించుటలేదె
యనుగ్రహింపుమీ॥

ముద్దులు మూటగట్టు చిఱుబొజ్జరొ
మెట్లు మఱెన్ని గారడి
విద్దెలు దాచినావొ! కనుపించవు పైకి;
విచిత్ర సృష్టి ము
ప్పొద్దులు లేవఁదీయుచు ప్రభుత్వ
పటుత్వము జారనీని బల్
గద్దెసు పాండురంగ! త్రిజగత్పతివై
నను మోయలేవురా?

త్రిప్పితి వెన్నోమార్లు భవదీయ ప్రభుత్వ
గృహమ్ముచుట్టు నా
త్రిప్పలుఁ జూడవైతివిగదే యొకమారును
గూడ ;యింక నా
చెప్పులు నన్నుఁజూచి దఱిఁజేరి మఱెన్ని
చివాట్లు పెట్టెనో !
యిప్పుడు పాండురంగ! తలయెత్తి
కనుంగొనవైతి జాలిగా॥

గ్రంథములెన్నివిప్పినను గాంచవు
నీ చెలికాడు,నీ దయా
సింధుకళానిమగ్నుడు కుచేలుఁడు
పిల్లలకోడియై మహా
గంధగజేంద్రలోకమున గడ్వక
నీకడ పడ్డదాక సం
బంధము పాండురంగ !యిలపై
కనవైతివి యెంతవాడవో !

నక్కిన నల్లనయ్య ! పదునాల్గు
ప్రపంచములన్ని కుక్షిలో
క్రుక్కినమీద నా నుడులు కొంచె
మవెక్కడ నల్గిపోయెనో
ఒక్కటిగూడ జ్ఞాపకము నుండక
పోయెను నీకు ;నీ కృపా
దృక్కులు పాండురంగ !కడదేర్చ
చెలామణిగావు జన్మలో॥

తియ్యని చక్కనయ్యవు, త్వదీయ
నివాస విలాస మెంత త్యా
గయ్యకు చెప్పనయ్యవుగదా !మఱి
నీ ప్రియురాండ్రకైన నీ
వియ్యది తూగుటుయ్యెల పయిం
వినిపించకపోతి ;నా మన
శ్శయ్యను పాండురంగ !నిముసమ్ము
పరుండుము చెప్పివైతురా॥

చీలిచి గడ్డిపోచ నగిషీపనిచే
గిజిగాడు చెట్టుపై
మేలి కులాయమెంతొ సుతిమెత్తనిరీతి
రచించుకొన్న నీ
మాలిమియున్న వానరుఁడు మాత్ర
మదేమియులేక యీ యర
ణ్యాలను పాండురంగ! శరణంబని
పట్టెను కొమ్మకొమ్మతో॥

దుగ్ధపయోధికన్య తులఁదూగెడి
భాగ్య మనన్య దివ్య సు
స్నిగ్ధ శిరీషపేశల వినీల వినిర్మల
మేఘమాలికా
ముగ్ధకు చక్కఁగా భువనమోహన
మూర్తినిఁ జేయబట్టి సం
దిగ్ధము పాండురంగ! కడఁదేర్చు
ప్రసిద్ధము త్వత్కృపాయుపల్॥

సముడవు సర్వజీవులకు : చాల విధాల
విశాల విశ్వరూ
పము ధరియించువాడవు ; తుపానుల
కించుకసేపు విశ్రమిం
చుము మఱి నా కుటీరమున చూతువు
నీ సుఖభోగలాలస
త్వములకు పాండురంగ ! పటుధైర్య కళా
స్థిరశౌర్య సంపదల్?

డప్పులు కొట్టుచుండెడి బడాయి
మనుష్యులఁ జేరఁదీసె నీ
గొప్పలు చాటుకొన్న ధనికుండవు
నీవు ధరిత్రిపైన నా
త్రిప్పలు చెప్పుకొన్న విను దేవుఁ
డొకండునులేని నీదు కా
ల్చెప్పును పాండురంగ ! చెవిఁ జేర్పవుగా
మఱి నీవు నా మొఱల్॥

నల్లనివాడవై త్రిభువనాలను
నక్కిన దొంగవాడవై
మెల్లగ కొంపలన్నిటికి మెల్కువ
యుండని మత్తుఁజల్లి నీ
వెల్లరి సొత్తు దోచుకొని యే మృదు
పల్లవపాణి కొంగులో
కొల్లగ పాండురంగ ! గయికొమ్మని
పోసితివో వచింపరా॥

నిమసముఁ దీరనట్టి మహనీయుఁడ
వెందరి కప్పువడ్డ పె
ద్దమనిషివై ప్రపంచమున దర్శన
మీయక యింత యంధకా
రముగల మూల డాగితివిరా
యధికారములన్నిపోయి !న
మ్ముఃము నను పాండురంగ !నిను ముంచెడి
యప్పులవాడ గానురా॥

మణులకు మాటనీయవు సుమా యని
నేను ప్రభాత సుందరీ
మణి మృదు పాణి పల్లవ సుమమ్ములు
దెచ్చి త్వదీయ దివ్య స
ద్గుణ కరుణాంశులో మధువుకోసముఁ
బోసితి నెన్నిజన్మలో
ఋణపడి పాండురంగ ! యిక నీవు
ఋణంపడినావు తీర్చుకో॥

నోరు మెదల్పవేమి ? గుడినుంచిక
కాలు కదల్పవేమి ? నీ
పేరు జగమ్ములో పగిలి ప్రేలి
హడావుడిలేపి యెంత బృం
దారక చక్రవర్తిగ ఘనమ్ముగ
నేఁడు ప్రతిధ్వనించెనో
కూరిమి పాండురంగ ! కనుగొందువు
రమ్ము మనోహరంబుగాన్॥

తీరిక లేనివాడవయి దివ్యకళా
రమణీయశబ్ద సం
చారము సల్పువాడవయి చక్కని
చుక్కల కౌగిలింతలో
చేరుట కెట్లు నీవు దయచేసితివో
కనుగీటుకొంటు ! నీ
పేరిక పాండురంగ ! నడివీధినిఁ
బెట్టెద నేఁడు జూడుమీ॥

రాగసుధారసమ్ము సుమరాజ
కుమారి పరిమళమ్ము నీ
భాగవతమ్ము కొంచెము సభా
సముఖాన బహిర్గతమ్ము చే
సాగెను ; ఇంక నీ ముసుగు చాటున
దాగుడుమూతలాట లే
లాగున పాండురంగ ! పదిలమ్ముగ
సాగునొ నేను చూతురా॥

లోపము లేనివాడవు. త్రిలోక
తిలోత్తమలైనవారి స
ల్లాపముగాని నచ్చని కళా భువనైక
మనోజ్ఞమూర్తివై
దాపున నిన్ని లేకి యవతారము
లెత్తితివేమి ? యే మహా
పాపము పాండురంగ ! బలవంతముగా
నిను చుట్టుముట్టెనో!

చింతలు చిక్కుచీకటులు సిగ్గులు
త్రొక్కిసలాడు కొంపలో
నింత మహాంధకారమున నేవిధిగా
జొరబడ్డవాడవో
యింతకు లబ్ధమైనది మతేది
యబద్ధముగాక ? నిన్ను ప
ట్టింతుర పాండురంగ ! పొగడించెడి
భక్తులచేతఁ జూడుమీ॥

గారడివాని మాదిరి జగా లవలీలగ
సృష్టిఁజేసి,మా
చేరెడు కండ్లుమూసి,బహుచిత్రము
లెన్నొ యొసర్చి,యిన్ని నో
రూరెడి పండ్లగుత్తి తరువుల్ కడు
నేర్పునఁ జూపి యిండ్లలో
దూరితి పాండురంగ ! గజదొంగగ !
నీ కిక పర్వులేదురా॥

స్థిరముగ నీవు నీ ఘనతఁదేల్చి
యజస్ర సహస్రనామ సుం
దర బిరుదాంకితుండవయి తావక
దర్శన భాగ్యరేఖ ట
క్కరివయి చూపకుండ చిరకాలమునుంచి
త్వదీయ పాద కిం
కరులకు పాండురంగ ! బహు చక్కగఁ
బెట్టితి పంగనామముల్॥

(యతే కావల్సివస్తే "నవకంబుగఁ బెట్టితి")

నీ కమనీయ విశ్వ రమణీయ కళా
నిలయంబులోన నా
లేకి మొగమ్ము సూచి నిను లేవిడి
నేతురుగూడ ; నేడు ము
ల్లోకమువారు నీవు బహు లుబ్ధుఁడవంచు
తృణీకరింత్రు ; నీ
రాకకు పాండురంగ ! కనరా యొక
ఆడది యైన లేమనా ?

కమ్మని పువ్వుబోండ్ల కడగంట
నజస్ర సహస్ర దివ్య శీ
ర్ష మ్ములు నీవు దువ్వుకొని చక్కఁగ
వచ్చెడిదాక మేము నీ
గుమ్మముముందు చించుకొని గొంతులు
బొంగురువోయి యీ నిశీ
ధమ్మున పాండురంగ ! తొలిదారిని పోమ ?
వృధాప్రయాసతో॥

ఎన్ని యుగాలనుంచియొ మఱింత
యమాయకులైనవారిలో
యిన్ని బడాయివేసములకే బెదరించి,
గడించి పెద్ద సం
పన్నుఁడవైతివోయి ! నిను పైకిక
లేవగలేని కుంటి మ
ల్లన్నగ పాండురంగ ! ప్రజలందఱి ముందఱ
తేల్చివైతురా॥

చక్కని యాశఁబెట్టి నను సర్వముఁ
దెమ్మనిచెప్పి చేతిలో
పిక్కలు నాల్గు గైకొని వివేక విహీనునిఁ
జేసినట్టి నీ
టక్కరివేస మెల్లరకు డప్పులుకొట్టి
వచింతు ; జన్మలో
చిక్కవ పాండురంగ ! పద, చెప్పెద
నీ తలిదండ్రు లెవ్వరో॥

దాతవు నీవు ; నీ గుడి ప్రదక్షిణ
మెప్పుడు చేసిచేసి, బా
బో ! తల బొత్తిగా నెఱసిపోయి,
శరీరము వంగిపోయి నీ
తాతగ నేను నీ కథలు తక్కినవారికి
చెప్పుచున్న వి
ఖ్యాతికి పాండురంగ ! బురఖాలను
మార్చుచు పొంగుచుంటివా ?

నీ చరణాలు నమ్ముకొని నీకు
సమస్తము ధారబోసి నీ
రాచరికాలకెల్ల పహారాలను
గాచెడివాని నెంతయో
నీచముగా మహాశ్రమకు నెట్టినదానికి
నీకు శిక్ష నే
వైచితి పాండురంగ ! కరువా ! గుడిలో
పడియుండు తిన్నగా॥

బిరుదులు బిఱ్ఱుగా బిగిసి ప్రేలు స్వయంవర
మీ ప్రపంచ సుం
దరికయి సర్వ రాజభువనాలకుఁ జాటి
ప్రచండ ధాటితో
పరుగులువెట్టివచ్చు బలవంతుల కింత
పరీక్షపెట్టి వి
ష్కరషగ పాండురంగ ! మొనగాంధ్ర
ధనుర్విభవమ్ముఁ జూతువా ?

విశ్వము కల్పవృక్షముగఁ బెంచి, సృజించి
ద్విరేఫసంఘముల్
శాశ్వత సౌఖ్య దివ్య మధుసంపద తుట్టె
గుటించి సర్వ భూ
మీశ్వరులం మహారణ మహీస్థలిపై
దుమికించుచున్న వి
శ్వేశ్వర ! పాండురంగ ! గడియించెదుదేమిటి
నీవు దానితో ?

మా భయభక్తిఁజూపఁగల మా
భవనమ్ములకంటె చూపులో
నీ భువనమ్ములెన్ని ప్రతినిత్యము
భత్యముగూర్చి యెంత సం
క్షోభములేపి నీకు విసుగుం కలిగించి
పయోధిఁద్రోసెనో
లోభిగ పాండురంగ! కలలోనయినా
కనుపించకుంటివా?

జోరుగ బండి సాగినది సుమ్మీ
భయమ్మేటులేక జీవనా
ధారముకోసమై నిలువద్రవ్యము
నీవు మఱెంత నీ ధనా
గారములోన దాచితివొగాని
జగాలు యుగాలు నీదు ప్రా
కారము పాండురంగ! నరకమ్మున
గూల్చనిదారి జూడుమీ॥

రంభగుణించి చేసిన పురాకృత
పుణ్యము పండి నీ ధ్వజ
స్థంభమువోలె పెగ్గెడి పిశాచ
నిశాచరకోటి యజ్ఞ సం
రంభములన్ని మెచ్చి నవరత్న
కిరీటములిచ్చి ధర్మవా
క్ష్వంభన పాండురంగ ! కలకాల
మొనర్చి చిగిర్చకుందువా ?

జానెడు పొట్టకై సరకు చాలక నీదు
విశాల విశ్వ సం
స్థానముచుట్టు భీకర నిశాచర ఘోర
సముద్రఘోష యు
ద్ధానికి సిద్ధమైనది గదా!యిక నీ
చిఱుబొజ్జ పట్టెఁడ
న్నానికి పాండురంగ ! భువనాలు మఱెన్ని
దహించుచుండునో॥

బాలుఁడు కొండ వొడ్డది సవాలుకుఁ జాలదు
వీడటంచు మా
ర్మాలలవారలేమి తలబోయకుడంచు
బడాయితోడ శౌ
ర్యాలవలీలఁబల్కి చతురబ్ధిపరీత
ధరిత్రినెన్ని గ
గ్గోలలు పాండురంగ? పడికొట్టుకొనంగ
కుదించిరేఫితో॥

సరసకు చల్లగాఁజని నిజమ్ముగ
చిల్లరవాకిదాని మా
దిరి ప్రతివానిచేతను త్వదీయ రమా
రమణీలలామ య
ల్లరిఁబడి చెడ్డ తిట్లుపడి లాగెను
వీధికి నిన్ను;దానితో
ముకుతువు పాండురంగ! మునుముందిక
కాపురమెట్లు చేతువో!

కదలి చతుస్సముద్రము లెకాయెకి
బారలు సాచి కొల్చినం
పెదుగుచు తేలకుండెగద నీ
హృదయంబు మహావిశాలమై
సదనము నేఁడు క్రిక్కిరిసి చాలక
పోవుట హేతువేమి? ప
న్నిదముగ పాండురంగ! తెగ నిర్భాగ
మోటము నీకు లేదురా॥

నీవు జగత్త్రయమ్మున జనించిన యీ
ప్రళయమ్ములన్ని యే
లావున త్రొక్కిపట్టెడి బలమ్ము చలమ్ము
గడించలేక నీ
జీవితమింక సంద్రమునఁ జేర్చి బుడుంగున
మున్గియున్న నీ
దేవియె పాండురంగ! వినుఁ దేల్చెను పచ్చని
మఱ్ఱియాకుపై॥

హాయిగ నీకు కావలసినంత ధనమ్ము
నొసంగు చక్క వ
మ్మాయి మతెచ్చటో దొరికి మాకెటు
జానెడునేల దక్కవ
ట్లీ యిరుకైన పట్టణములెల్ల దురాక్రమణ
మ్మొనర్చి. పా
పాయిగ పాండురంగ! చసుబాలను
త్రాగెడివాడ వైతివా?

కనికరమెల్ల గడ్డలయి గంపెడపేశల
కింత బక్క చి
క్కిన నిరుపేదవాని బలికిం మఱి యెంత
కసాయివాండ్ర గై
కొని నగరాలలో కులికి కూర్చునియుంటివో!
నీకు దక్కనా
తినుటకు పాండురంగ! కడు తియ్యనిమాంసము
వాని బొందిలో.

వాకిట నీ ప్రపంచ పురపాలకవర్గము
పట్టి పగ్గము
ల్లేక చరించి యీ కలిమిలేముల చెత్తను
నెత్తనీక భూ
లోకమునెల్ల నేఁడు యమలోకమొనర్చె
నటంచు నాకు నీ
వే కద పాండురంగ! సెలవిచ్చిక పంపితి
పాకివానిగా॥

తృణముగ పాకివాడనని దేల్చక ! నే నొక
పూట రాకపో
యిన భవదీయ దివ్య సుమ హేమ కళా
భువనాలు పాడువె
ట్టిన భవనాలు మాదిక్కు ప్రకటించుఁగదా
కలరాలగోల ; పె
త్తనములు పాండురంగ ! చెడుదారికి
తీయక పత్తనాలలో ॥

దేవికి నిన్ను గన్న వసుదేవుఁడు
గాడిదకాళ్లు పట్టినా
డో: నగుబాట్ల కట్లనె నుడుల్
పొడివింక రసమ్ముఁజేసి నీ
పీనులకెక్కఁజేయుటకు వెట్టిగ
నన్ను మతెన్నిమార్లు రం
గానికి పాండురంగ! యిల గాడిద
కాళ్లను పట్టఁద్రోతువో!

సురుచిరమైన దివ్యశుభసుందర
మోహన చక్రవర్తివై
ధరఁగల యందగత్తెల సుతారముగా
గడియించి యెప్పుడో
మురిసితిగాని యిప్పుడు సముజ్వల
చిత్రజగత్తునుంచి సుం
దరి నిఁక పాండురంగ! సరదాపడి
పిల్వుము తెల్విఁజూతురా!

క్రొత్తగ పాపపున్నెము లెఱుంగని
యీ పసివాని చేతిలో
పొత్తము బొత్తిగా చినిగిపోయి
మిఠాయికి కాగితంబులై
చెత్తగపడ్డమాడ్కి విలసిల్లు
ప్రపంచపు పుస్తకమ్ము మా
పత్తన పాండురంగ !బహుభంగుల
చిన్గెను నీదు చేతిలో ॥

పంతములేల నీకు కలవారి
ప్రపంచములోన గొప్ప శ్రీ
మంతుఁడవై మహాసుఖము మధ్య
నిఱుక్కొని నీవు నోరు లే
కెంత యవస్థయోపడి మఱెవ్వరి
వాగ్విభవానఁదేలి ని
శ్చింతగ పాండురంగ !సుఖజీవిత
మారసినావా చూచుకో ॥

లక్ష యుగాలనుంచి పదిలంబుగ
వింత విశాలధాత్రి నీ
యక్షయపాత్రయై వెలితియై
కనుపించుట కేమి హేతువో
దక్షుఁడవై తి వెల్ల సరదాలకు నీకు
మఱిన్ని యూళ్ల లో
భిక్షలు పాండురంగ ! యిక పెట్టని
గుమ్మము లేకపోయెనా ?

నారులు పోసినావు, వరినాటుబు
పూర్తిగ నూడ్చినావు, బం
గారపుమొల్క దుబ్బులను కట్టిన
దానికి పొంగినావు, క
న్నీరును కార్చు మొక్కపయి నీ విఁక
నీలిగినావు రేపు తూ
ర్పారకు పాండురంగ ! కనవా మఱి
తాలయిపోవు ధాన్యముల్ ॥

బొత్తిగ కుక్కిమంచమయిపోయె
ప్రపంచము త్రొక్కులాటతో
నిత్తరి హాయిగా నిదుర యేరికి
పట్టకపోయె ; నేఁడు మా
నెత్తురు పీల్చు నల్లులకు నీవు
పసందుగ వాల్చినావు ; నీ
చిత్తము పాండురంగ !పరిశీలన
జేసిన నల్లటాయిరా ॥

పరిపరి సాంప్రదాయముల వంకర
టింకరలైన యన్ని య
క్షరములు నీ సువర్ణపదకంజ
దళంబులపైన దివ్య సుం
దర సుకుమార కావ్య కవితాసుమ
గుచ్ఛములైనఁగూడ యీ
నరులను పాండురంగ !యొకనాటికి
చక్కగ కల్పవేమిరా ?

అత్రముతోడ నీకొలకు హాయిగ
నా మృదుకావ్యమాధురీ
సూత్రము చక్కచక్కని ప్రసూనము
లన్నిరకమ్ములేరి యే
మాత్రము జారనీయక సమస్తము
హారముఁజేసినట్లు, నీ
సూత్రము పాండురంగ !కడుచోద్యముగా
మము కల్పకుండెరా !

పేటలు భేదమైన పురవీధు
లనేకములైన,నీ జగ
న్నాటక వేషధారులకు నాల్గు
రకమ్ముల భాషలైన, ము
ప్పేటగకల్పి పట్టణము పేరొకటే
గద చెప్పినారు ;నీ
కేటికి పాండురంగ !మఱి యిన్ని
తగాద మతాలు చెప్పుమీ ॥

చాల నిరంకుశత్వముగ సంఘము
చేసిన తప్పులెన్నియో
వేల యుగాలనుంచి కడు బీద
మొగాలకు రుద్ది నీవు పా
పాలకు భైరవుండవయి పాడు
ప్రపంచమొనర్చి పెద్ద గ
గ్గోలగ పాండురంగ! జనఘోషలు
లేపితి వీధి వీధిలో ॥

మోహనమూర్తివై మురిసి పూర్వము
స్త్రీలగుఱించి యెంత వ్యా
మోహముపడ్డ దొడ్డదొరవో మఱి
నీవు! త్వదీయ పుత్ర స
న్మోహము(గూడ స్త్రీల చరణమ్ములకున్
ప్రణమిల్లి నే(డు నీ
గేహము పాండురంగ! కడిగించెను
సొంతము తప్పులేదురా ॥

ఎద యయినట్టి ఘూపు వెను తెప్పి
రకమ్ము లగొళ్లు నేఁడు ధు
ర్మదమున పర్గులెత్తి పురమార్గము
దుమ్ము దుమారమెత్తి బిల్
పదవుల కెక్కఁ బోవుటకు పాపము
మేతయు నీళ్లు లేక యే
బ్రదుకును పాండురంగ! తరువాత
గడించెనో నీవు చూడుమీ ॥

బొమికలు రాల్చి యేలుటకు పూర్వ
నిరల్లకుశ ధారుణీ ప్రభు
త్వములిఁక సాగనేరవని ధాత్రి
ధనాఢ్యులు పెద్ద నాయక
త్వములకు ప్రాకులాడి యెగఁబడ్డ
యుగమ్మున నీవు నీ పరా
క్రమమున పాండురంగ! ప్రజకొళ్లు
మతెక్కడ పట్టుచుంటివో!

తొంబదివంతు భూప్రజను దోపిడీ
చేయుటకై యుమాయక
త్వంబున త్రొక్కిపట్టఁగల వారల
కిప్పుడు గొప్ప నాయక
త్వంబు లభించినట్లు భయభక్తి
భ్రమల్ పెనవేయుచున్న లో
కంబున పాండురంగ ! పడికట్టు
ప్రభుత్వము నీకు దక్కెరా ॥

నేఁడు సమస్త సౌఖ్యములు నీవు
విసర్జనఁజేసిఁగూడ మా
ర్వాడిముతాల స్నేహమునుఁబట్టుట
మానకపోతి వింక ; మా
వాడకు నాయకుండయినవాఁడు
త్వదీయుని ముఖ్యశిష్యుఁడై
మేడకు పాండురంగ ! ప్రణమిల్లుటలో
పొరపాటులేదురా ॥

ముకములలో సమస్త సుఖభోగ
పిశాచములన్ని గోచిపా
తకు బలియిచ్చి బూడిదను ధారణఁ
జేసిన యీశ్వరుండు కో
టికి -పడగెత్తినట్టి చెలిపెక్కెము
క్రింద మకాము పెట్టి ధా
రకమును పాండురంగ ! నవరత్న
నికేతనమందు గాంచెరా॥

గంజికి వానిపోయెడి మొగాలు
దగాపడి నల్గిపోయి 'రో
డ్డింజను' కాళ్ళక్రిందపడి యెన్నటికిం
దల యెత్తలేక నీ
క్రొంజిగురాకు పాదములు కొంచెము
కందని రాచబాటలో
గింజకు పాండురంగ ! విధిగీతను
కంకరలైన చూడవా?

శింజిని యెక్కుపెట్టి విలసిల్లెడి
పేరునఁబడ్డ పెద్ద 'రో
డ్డింజను'వంటి నాయకుని యీ ప్రజపై
నడిపించి స్వేచ్ఛగా
మంజులమార్గ మీవు ధరమధ్య
షికార్లకు వేసి యింక మా
యంజలి పాండురంగ ! కలియంబలికై
వడలించుకొందువా ?

అనుపమశోభ ఉమ్మరుఖయ్యాము
హాయాము తయారుచేసి పో
యిన మధుశాలలోన నడుగెప్పుడు
పెట్టితివో మతేమొ ! నీ
వెనుక త్వదీయ దాసులిఁక వేనకు
వేలు ప్రయాణమైరి ; క
ర్వునఁబడి పాండురంగ ! యొక ముంత
మిగల్చక పర్వుతీతువా ?

మధుకలశం బొకందెవఁడో మట్టిది
వట్టిదీ ప్రాప్తమై మహా
బుధులకు దానిలో తగులు పూర్వపు
వాసనఁజూపి యెన్నియో
కథలనుఁ జెప్పి శ్రావ్యముగ కావ్యముఁ
జేసినచోట సిద్ధమై
వ్యథఁబడి పాండురంగ ! యధరామృత
పానము నీవు చేతువా ?

ధీనిధులెందరో పొడమి దృష్టికి,
సృష్టికి వన్నెఁదెచ్చి కృ
ష్ణానది యొడ్డుపై శ్రవణసౌఖ్యముగా
మృదు మాధురీ కళా
గాన సుధాతరంగము లఖండ
మృదంగము లశ్వధాటితో
సేనగ పాండురంగ ! దరిఁజేరి
సదా నిను ముట్టడించెరా॥

వశమగువాక్కుతో విజయవాడకుఁ జక్కని న్యాయవాదియై
దశగల భాగ్యశాలియయి ధార్మిక బ్రాహ్మణ సార్వభౌముఁడై
దశరథరామయాభిదుఁడు ద్రవ్య నివేదనశాలఁబెట్టి స
ద్వశమున పాండురంగ ! పరమాత్మకుఁ గోవెలఁగట్టి కొల్చెగా ॥

క్రమ్మిన రెల్లులో బిరబిరా
పరువెత్తెడి నా వరాల కృ
ష్ణమ్మ జగానవేసిన సుధాంజలి
నోములతోట బల్ సుతా
రమ్ముగ కుట్మలించి నవరత్న
సుమమ్ములు పూచి నీ పదా
బ్జమ్ములు పాండురంగ ! సిరి
చక్కదనమ్ముల కిల్లుఁజేసెరా॥

తేలికఁ జేయఁబోకుమి ! మదీయ
కళాకురళీకిశోర గో
పాలక చక్రవర్తి మృదుపాద
మనోజ్ఞ కథా సుధా తరం
గా లిల కృష్ణలోఁబొడమి, కమ్మని
కాంగ్రెసు భాష్య ధర్మసూ
త్రాలయి పాండురంగ ! బలధైర్య
సముద్రములయ్యె చూడుమీ॥

(12)

ఏనుగులెక్కి నీల్గిన కవీంద్రులహో
తలక్రిందులైన కృ
ష్ణానది గట్టుపై త్రిభువనాలు
జయించెడి వీరశౌర్య సం
స్థాన యశోవిరాజిత ప్రజా
విజయుల్ నివసించి వజ్రసో
పానము పాండురంగ! భగవన్మత
సౌధము పైకి వేసెరా॥

కృపఁగల విశ్వనాధుఁడయి కిన్నెర
సాని ధరిత్రినెల్ల వె
య్యిపడగలందు మోసిన ఫణీంద్రుఁడు
మా రతనాల కృష్ణ గ
ట్టుపయి జనించి వాఙ్మయ పటుత్వ
కవిత్వ ప్రభుత్వ వజ్రపీ
ఠిపయిన పాండురంగ! పొగడించె
కథా రమణీయ వస్తువుల్॥

తూనిక కింక మా కనకదుర్గ
కటాక్షము తీసిపోని కృ
షానది తోయమై సకలశాస్త్ర
పురాణ పవిత్ర నందనో
ద్యాన సరోవరంబులయి, మహాత్ములు
మెచ్చెడి రాజహంస సం
తానము పాండురంగ! భువనాలకు
నీ తిరుణాల కెక్కెరా॥

వందలు వేలు బల్ ముడుపుఁబట్టి
సదా కవితాజగత్తులో
అందటి జుట్టు సొంత మవురా
గొరిగించి హుషారుగా జయ
స్యందనమెక్కి కృష్ణపయి సాగిన
తిర్పతి వెంకటేశ్వరుం
డిందుకు పాండురంగ! గడియించెను
నన్నిఁక జైత్రయాత్రకై॥

శాశ్వతమైన కీర్తి ధనశాలిగ
భూస్థలి మారుమ్రోగి, భూ
మీశ్వరులాగలేని యిలనే
యవలీలగ నెత్తుకొన్న నా
గేశ్వరుఁ దొక్కఁడప్పుడుదయించి
జయించిన కృష్ణగట్టుపై
విశ్వము పాండురంగ! మురిపించెడి
దాతను విస్మరింతువా!

విశ్రుత కీర్తికెక్కెడి ప్రవీణత
లేపిన విప్లవాలు సూ
తాశ్రమమందు నందనములై
కవితామృత గాన విశ్వ వా
ణీ శ్రవణోత్సవాలయి వినిర్మల
మంజుల కృష్ణవేణులై
మాశ్రమ పాండురంగ! యిల మాన్పెడి
చల్లని స్వామి నిచ్చెరా॥

## కృష్ణా జిల్లా

తోయధిగా సదా కనకదుర్గ । దయారస భాగ్య వైభవ
శ్రీ యమునా ప్రవాహములు రేపుచు । శ్రీ కొణకంచి సూర్యనా
రాయణశాస్త్రి మా తర తరాల వరాల । వశిష్ఠుడౌచు దీ
ర్ఘాయువు పాండురంగ! విజయంబుగ । బోసెను మాకు ప్రేమతో॥

ఈశ్వర సాక్షిగా(దొణకు చెన్న(డులేని విధాన "ప్లీడరై"
విశ్వము పట్టు "లీడరయి" పెక్కు ఘనమ్ములు మ్రొక్కుచున్న కా
శేశ్వరు డెంత చిక్కయిన నిట్టెకదా విడగొట్టగల్గు ; వి
శ్వేశ్వర ! పాండురంగ! గ్రహియించి యజస్ర మనుగ్రహించుమీ॥

చిట్టికి మించినట్టి బుధశేఖరు డే సరదార్ల లో జగా
జెట్టిగ కంటికందదు ప్రసిద్ధిగ సర్వజగద్ధితంబుగా
పట్టిన పల్లె పట్టణ శివార్లకు చేసిన సేవలెన్నియో
కటుము పాండురంగ! జమకట్టెడి నీ కొలబద్ద లెక్కతో॥

కుందనమౌచు పచ్చని చిగుళ్ల కిశోర । వయస్సులో కళా
స్యందనమౌచు దివ్యనవయౌవన భాగ్య । దశోద్యమాలలో
సుందరుడై విరాజిలుచు చుండురి వేంకటరెడ్డి । మా సుధా
నందుని పాండురంగ! ప్రతినం గురుదేవునిగా । స్మరించెరా॥

అంబ కృపాకటాక్షము మహాప్రతిభా। బలమిచ్చినం నిరా
డంబరుఁడై చితంబరుఁడు దాయుపెరుంగడు కానిడబ్బు, స
త్యంబుగ న్యాయవాది సలహాల నొసంగి। జయింపజేయు పం
తంబున పాండురంగ! ఘనతల్। కవితల్ చిగిరించు స్వామియై॥

కోటియుగాలకైన తెలుఁగుల్ వెలుఁగుల్। దుమికింపగల్గు మా
జేటి కులావతంసుఁడు విశేష జిగీష। యశోధనుండు ము
మ్మాటికి రామమోహనుఁడు మార్దవమైన। దయార్ద్రచిత్తుడై
నాటెను పాండురంగ! కవనాలకు। చక్కని తోటలెన్నియో॥

గుబురులువట్టి పచ్చని చిగుళ్లు పసందుగ। నచ్చి హాయిగా
ప్రబలిన వీరరాఘవుని వంశమహీరుహలక్ష్మి। రావు సా
హెబయిన పీఠిపై బయన హేమకిరీటము। లుంచి విశ్వ కీ
ర్తి బిరుదు పాండురంగ! చిగిరించఁగ జేసెను। శోభనాద్రితో॥

దానకళాప్రవీణులకు దావలమై। మనికొండవారి సం
స్థానము విశ్వభారతి సుధారసగానము। కాశివిశ్వనా
ధానన భాగ్యరేఖకుఁగదా కుసుమించె। మనోజ్ఞమైన కృ
ష్ణానది పాండురంగ! సువిశాల యశోన్నత। శైల మెక్కగా॥

కొండల చక్రవర్తి మనికొండ యశోధన శౌర్యమండలా
ఖండలు దేమికాదనెడి గౌరవ రత్నకిరీటధారియై
యుండిన విశ్వనాథుడెపుడో కల పెద్ద ఋణాలు మొత్త మా
తం డిల పాండురంగ! ఋణదాతల బిల్చి యొసంగె దాతయై॥

రాయలువోలె మా నగరరాములు । పాత్రుఁడొకండు హాయిగా
తీయని కావ్యగానకళ తీపికి । మామిడి చెట్టు కొమ్మపై
కోయిలగోల నచ్చి కవికోకిలఁ । గై కొని పెద్ద కృష్ణలో
నీయెడ పాండురంగ ! గజయాతకు । దించె కవీద్గజమ్ముగా॥

మకిలకు దూరమై తన సమస్తము । పూర్వము ధారవోసి నా
ట్యకళల కూపిరిచ్చి తనరారిన । మైలవరమ్ము చక్రవ
ర్తికి రతనాల కీర్తిఁ గొనితెచ్చి । సదా ప్రవహించుచున్న కృ
ష్ణకులుకు పాండురంగ ! భువనాలకు । నీ తిరుణాల కెక్కెరా॥

గొప్పలకేమిగాని, రసికుల్ సుకవుల్ కొనియాడు । నట్లు నై
దప్పలస్వామి ముస్లిములు హైందవు లెప్పటి । కైన నేకమౌ
చొప్పున పేరువెట్టుకొని శూరులలో పెను । రుస్తుమౌచు, వేల్
గుప్పుచు పాండురంగ! నెలకొల్పెను గుళ్లను । గ్రంథసౌధముల్॥

భారతజాతిలో సుకవిబ్రహ్మల ముద్దులుపూచి కొప్పురా
పూరి కలమ్ము కప్పురపుటూహలతో కవనాలతోట శృం
గారముగా రచించి సహకారముగా వరహాల సత్యమై
కీరితి పాండురంగ ! కులికించి జయించె మయూరనాట్యముల్॥

నవరసుబాబుగా కవిజనంబులు మెచ్చెడి మా నవాబుగా
నవనవలాడుమాట కవనాలకొసంగెడి మేల్ కితాబుగా
భవనములేని నీ నరసుబాబు గదా బెజవాడ పట్టణం
బు విలువ పాండురంగ! గజముల్ ధ్వజముల్ నడిపించి నిల్పెగా॥

మెత్తనివాఁడు ఒక్కచెలిమిం విసుగెత్తనివాఁడు కీర్తి పు
వ్వొత్తిగ వెల్గువాఁడు రిపువర్గము బొత్తిగలేనివాఁడు నో
రెత్తిన రత్నరాసులు మహిన్ నిలువెత్తున బోయువాఁడు నా
కిత్తరి పాండురంగ! కనిపించడు పైడనవంటి దాతయై॥

ఆర్తులకెల్ల చల్లని దయారసవార్ధిగ రత్నకౌముదీ
కీర్తికిరీటధారిగ తెగించి కుదించి సమస్త రుగ్మతల్
పూర్తిగ వారద్రోలి నగుమోము వరాలు చిగిర్చు దక్షిణా
మూర్తిని పాండురంగ! జగముల్ యుగముల్ విడనాడలేవురా ॥

ప్రజలకు రాజవైద్యము ఖరారుగ నేఁడు నిఖార్సుసేవతో
ఋజువునుజేయగా తన సిరుల్ విఱజిమ్మి భిషక్ప్రపంచ పు
ష్టిఁజెలఁగి సూరియై రజతసిందురముం బొనరించినట్టి ది
గ్విజయము పాండురంగ! కొలిపించుము "టీ టి" వరప్రసాదముల్॥

ధ్వజములు గొప్పగా విజయవాడకు దిగ్విజయమ్ముగా మహా
విజయులు నిల్పుచుండెడి నవీన కళా రమణీయ సౌఖ్యముల్
కుజుని బృహస్పతిన్ గెలిచి కోటయనాయుడు మేస్త్రి కీర్తి పం
కజమున పాండురంగ! సిరి కాపురముం గులికింపజేసెరా॥

చలపతిరావు వనస్పతి। అల బెజవాడ పురపాలకాధ్యక్షుండై
వెలుగులుదెచ్చెను దెసలకు। నెల చల్లని పాండురంగ! నీవల్వాలతో॥

అరవలిఁక మ్రింగిపోకుండ తిరుపతిగుడి
వదిలి వేంకటేశ్వరు డిట్లు కదలివచ్చె
ఏ ప్రకాశ మితని వెల్గులెల్ల విప్పి
పరిఢవిల్లజేసినదియో పాండురంగ!

బసవా కృష్ణకిశోరుఁడు సిసలైన వరాలచెల్మి చిఱుమోహనుడై
రసవంతమైన కథలో ముసినవ్వున పాండురంగ! పుష్పించునురా॥

మునికొండ నృసింహుఁడు జో।రున సాహసుడై జగాన రోషానుడై
ఘనమైన మేడయెత్తున। ధనమిచ్చెను పాండురంగ। ధర్మంబులకై ॥

పచ్చవ పాపయచౌదరి । అచ్చెరువుగ ధర్మదాత యతిశాంతుండై
అచ్చరలమేడకై నను। నిచ్చ లతఁడు పాండురంగ। నిగ్గులు దెచ్చెన్ ॥

శరభయ్యవంటి భక్తుఁడు
ధరపైనను లేఁడటంచు దండకములతో
పురమందు గుళ్లు చక్కఁగ
స్మరియించెను పాండురంగ ! మాధుర్యముగా॥

విషమును విఱచెడి వైష్ణవ
ఋషిధోరణి గోపు బాలకృష్ణునికొడుకై
ఋషిలోక రామచంద్రుఁడు
విషయాలకు పాండురంగ ! వెలుగిచ్చెనురా॥

ఆలపాటి కుటుంబరాయండు మాకు
జోలపాడి కాపాడెడి జోదు దతడు
వాని సిరులుచూడ విజయవాడ గిరులు
పండువెన్నెలగాచెడి పాండురంగ !

ఇల కాంగ్రెసు సంస్థకు వం
దలు కాకరపర్తి భావనారాయణ మే
ధలుకట్టించు వదాన్యుడు
చెలువుగ మా పాండురంగ! చిలికించి సిరుల్॥

వనమాలి యల్లుడౌచును। సునిశితముగ పచ్చిపులుసు సుబ్బారావే
ఘనమైనదానధర్మము। లనయంబును పాండురంగ!హాయిగజేసెన్॥

అనుమాలశెట్టి రాములు
హనుమంతునివంటిబంటు హరిభక్తుండై
అనయము వినయము వానికి
మణిపీఠము పాండురంగ! మహిమాన్వితమై॥

చిత్రజగము గోపు శేషావతారంబు। మోసి పెద్దపేరు వాసిగాంచె
కువలయాన జోడుగుఱ్ఱాలషాట్లుపై। స్వారిచేయుతేడు పాండురంగ!

బెజవాడ పట్టణంబున
విజయారామ గుడివాడ పేర్రాజే మా
ధ్వజమై మంజుల కవితా
ధ్వజమయ్యెను పాండురంగ! దాక్షిణ్యముతో॥

అబ్బా ! మా అన్నవరపు । సుబ్బారా విల మహోవచోదుంధుభి యీ
దబ్బావాప్యమునచ్చునె ? కబ్బాలకు పాండురంగ! కనకంబిత దే॥

ఇల రాజేశ్వరి గురుడై నలువకు నడిపల్లి విశ్వనాధుం డెంతో
అలజడిగల హరిదాసై వెలిఁగెను గద పాండురంగ! విజ్ఞానముతో॥

గుంటూరు జిల్లా

జోరుగ నీరభారత యశోధన । విప్లవకారులున్న గుం
టూరు ధరాతలం బరుల డొక్కలుఁ । జీల్చెడి పోతుగడ్డయై
ఆరని పౌరుషాగ్ని బడబానలమై । మహిపై తుపాను తూ
ర్పారను పాండురంగ ! జలరాశిగ । పోసె జయాభిషేకముల్॥

రంగా రాకడపోకడ । బంగారై యున్న గూడ కర్షకులకు మేల్
బంగారు రాజ్యభాగ్యము । సింగంబై పాండురంగ! చేబట్టునురా॥

ఫళఫళలాడు తావళము తావక । మంజుల మాధురీ కళా
గళమున శ్రావ్యమైన మృదుకావ్య । కథా నవరత్న కన్యకాం
సుళిని నలంకరించ రసికుండయి । పుట్టెను బాలనాగు మం
గళగిరి పాండురంగ ! సిరిగ్రాలెడి । గుంటురి మండలంబులోన్॥

భూరథమూపి, యీశ్వరుని మోసి : మహావిజయమ్ముగాంచి గం
భీరగళమ్ముతో భువన భీకర। మయ్యేడి రంకెవేసి గుం
టూరు మహీస్థలింగల పటుత్వమునన్। వృషభేంద్రు లెండతో
మేరువు పాండురంగ! పొలిమేరకు। లాగిరి యద్భుతంబుగాన్॥

అభినవ తిక్కనాదులు మహాకవిబ్రహ్మలు। ప్రజ్వరిల్లి నీ
ప్రభలనుఁగట్టి నీ భువనపాలనకున్న। ధ్వజమ్ముఁపట్టి దో
ర్విభవముతోడ గుంటురి పవిత్రచరిత్ర। ప్రభాత లక్ష్మితో
శుభముగ పాండురంగ! సిరి చూపిరిగా। పలనాటి తోటలో॥

ప్రమథగణాధిదైవము ప్రపంచప్రభుత్వ। కళాప్రఫుల్ల వ
జ్ర మకుటముం ధరించి నవరత్న విశారద। నాట్యకేళికై
ఘుమఘుమలాడు తొల్కరిని గుంటురి। సీమకుఁ డించె రాఘవా
భ్రమమున పాండురంగ! కవిరాజులుముల్గల। దోలుదెబ్బతోన్॥

నెల్లూరు జిల్లా

మైకా కింగై మా కన్నాకైనాఁ డిపుడు జీ వి యస్ నాయఁడు లో
కైక మహాజాతకుఁడై వైకుంఠము పాండురంగ!వసుధకుదించెన్॥

గోపాలరెడ్డి మంత్రికి భూపాలకు డెవ్వడింక పోలడు ధరపై
మా పాల కల్పవృక్షము కాపాడెను పాండురంగ! కవితల్లజుఁడై॥

మదరాసు

లక్షలు రాసిగా తెనుఁగులచ్చి। పౌలా నెగబోసి శౌర్య హ
ర్యక్షు డుగా మదేభనివహంబులపైనను । దూకి విశ్వ పా
లాక్షు డులిక్కిపడ్డ బడబాగ్నిని బుక్కిట। బట్టి దేశ సం
ప్రోక్షణ పాండురంగ! మొగమోటమువీడి। ప్రకాశ మేలెగా ॥

పట్టాభిషేకములతో। పట్టాభి ప్రజాప్రభుత్వభవనాలకు సా
మ్రాట్టుగవచ్చెను నచ్చెనుపట్టిచ్చెనుపాండురంగ!బ్రహ్మాండంబుల్॥

పాకాలుపట్టి చెప్పును మా కమ్మనికైఁత రాజమన్నారు సుమీ
కైకొన్నా రేమనుకొన్నా కోటకు పాండురంగ! న్యాయాగ్రణిగా॥

ఆ జాజిపువ్వు నవ్వులు
రాజేశ్వరరావు పాట రమణీయములై
నాజూకు ఘుమాయించెను
జేజేఽగ పాండురంగ! చిత్ర జగములో॥

ఘటికుండై గానంబున
నటరాజై యీ జగాన నాగయ్య మహో
ద్భటుడై త్యాగయ్యలలో
స్ఫుటముగ మా పాండురంగ! ముద్దులు పూచెన్॥

చిత్రము ప్రసాదు తీసిన
ధాత్రి ఫళుక్కున మెఱసి విధాతృడు బెదరున్
చిత్ర జగద్దర్శకులకు
మిత్రుఁడుగా పాండురంగ! మేలొనరించున్॥

గానకళాసార్వభౌములు

అంకయ్య గానకళతో
శంకరు డింక దిగివచ్చి సౌందర్య సభా
లంకార మహోవాదిని
పొంకమ్మగ పాండురంగ! ముందుకుదెచ్చెన్॥

నాదస్వర భాగ్యంబయి
ఆదం సన్నాయి హోయి ఆంధ్రావనిలో
వేద మలయమారుతమై
మోదంబును పాండురంగ! పూచెను గదరా॥

పిచ్చహరి పీరుసాహెబు పేరు హెచ్చి
దిశలు పిక్కటిల్లెడి మేలి యశమునుంచి
రాఘవుని మునిరాముని మేఘరవము
బసవదేవు అంకెనిడిరి పాండురంగ!

## విశాఖ

రణమున బెబ్బులుల్వలె ధరాస్థలి బొబ్బిలి వీరశౌర్య గ
ర్జనలు,మహాప్రతిజ్ఞలు, ప్రశంసలు నేఁడు ప్రతిధ్వనింపఁజే
సిన మొనగాండ్రు గాంధ్రుమని సింహపరాక్రమముల్ విశాఖ ప
ట్టణమున పాండురంగ! కెరటాలుగ లేపిరి సాగరమ్ములై ॥

తెన్నేటి విశ్వనాధము । పన్నీటిసరస్సువంటివాఁడై ప్రజలో
మున్నీటిసామినైనను । మిన్నేటికిపాండురంగ మేతగవేయున్

రాయడుశాస్త్రి శిష్యులు, ధరాస్థలి । నిండిన ఆదిభట్ట నా,
రాయణదాసు శిష్యులు చిరస్మరణీయ । యశో విశాఖలై
వేయివరాలుఁజేయఁగల వేంకటస్వామి । ఫిడేలు తీగెలై
తీయగ పాండురంగ! భవదీయ । కథానిధులైరి హాయిగా ॥

## రాయలసీమ

గ్రామగ్రామమందు రామలింగారెడ్డి
మణులుపరచి కట్టమంచియయ్యె
వాగులెన్నివచ్చి పైఁబడిననుగూడ
పట్టుపట్టుచుండు పాండురంగ!

గుంజీయు గంజిసీళ్లకు । పంజాలు ప్రజాప్రభుత్వభవనాలకు మా
సంజీవిరెడ్డి తీసెను । సంజీవిగ పాండురంగ! సంరక్షకుడై ॥

## తెలంగాణం

బూరుగుల రామకృష్ణుడు పేరుఁగల మహాత్ముఁడయ్యెఃపెద్దనవాబుల్
మారుజవాబులనీయక పారాడగ పాండురంగ ! భయభక్తులతో॥

## గోదావరి

చేవగ మూడుమూర్తులు రచించిన భారత మీ యఖండ గో
దావరియై సుధారస కథా కవితా మురళీ ప్రవాహమై
జీవిత ధర్మమార్గ పరిశీలన శాసన ధాన్యరాశి భూ
దేవికి పాండురంగ ! కడుతృప్తిగ పోసెను పుణ్యరాశిగా॥

మేదినిమీద సత్కవులు మెచ్చెడి రాజమహేంద్రుఁడొక్కఁ డా
మోద కళా ప్రపూర్ణ రసముగ్ధ విశుద్ధ జగద్ధితైక సం
పాదక సార్వభౌముడయి వాగనుశాసన చక్రవర్తి శ్రీ
పాదము పాండురంగ ! ఘన భారత వేదములోనఁబట్టెరా॥

నేఁడు తటస్థపడ్డ చెడుస్నేహితు లందఱివోలెఁగాక, బొం
డాడ నృసింహశ్రేష్ఠి రతనాల సఖుండు కబీరుదాసుగా
తోడయినాకు, నీదు పదతోయజ భాగ్యముఁదక్కుదాక వెం
టాడుచు పాండురంగ ! కవితామృత తారకమంత్రమిచ్చెరా॥

రాజమహేంద్రుఁడప్పుడు ధరాస్థలి నన్నయభట్టుఁ బిల్చి య
వ్యాజ కృపాకటాక్షమున భారతగాథ పునాది వేసి న
ట్లీ జవతో నృసింహుఁడు మహేంద్రవరమ్ముపురీ నివాసుఁడై
మోజుగ పాండురంగ! తొలిపున్నెపు పైరును వేసె నాసిరిన్॥

ఇంద్రధనుస్సు మాదిరి కవీంద్ర ఘనస్వర కావ్యమాల ని
స్తంద్ర కథా సుధారస విశారద గౌతమియౌచు కొండప
ల్లీంద్రుని వీరవెంకయ బుధేంద్రుని సంస్తుతిఁజేసి రాజ రా
జేంద్రుని పాండురంగ మఱపించె మహేంద్రవరమ్ము మెచ్చగాన్॥

అయ్యల కయ్యగా కవికులా
ధరణమ్ముగ ప్రజ్వరిల్లి ల
క్ష్మయ్య సునామధేయుఁడయి శాంతి
కళాస్తవనీయుఁడైన త్యా
గయ్యగ తియ్యతియ్యని సుధాంజలితో
పెనుగొండ నెక్కి నా
నెయ్యము పాండురంగ! గమనించెను
బంగరు కొండయై సదా॥

వేవెలుగుల్ దొరల్ బలిసి వేద
వనమ్ముగ కోనసీమ గో
దావరితీరమెల్ల ఋషితల్లజులన్
విలసిల్లఁ జేయగా
పావనమూర్తియై బులుసువంశ
పయోనిధి సాంబమూర్తి నీ
దీవెన పాండురంగ ! సురదీర్ఘికగా
ప్రవహింపఁ జేసెరా॥

మేలిస్వరాలపూలు కుసుమించెడి కమ్మని
వాగ్విలాస
వల్లి లలితాంగి భర్తయయి లెక్క యెఱింగెడి
వక్తయైన గా
నాల కులావతంస జననాయకపాలక
రామమూర్తి ర
స్తాలకు పాండురంగ ! సమదర్శిని వెన్నెల
కాఁచె హాయిగా॥

మునుల మహాతపోధనము మూసకు పోసి
తయారుచేసి దిం
చిన ఘన దివ్య విగ్రహమొ చేరువ
కౌరవ చక్రవర్తి గు
ప్పిన మృదుపాణిలో పరశువేదియొ
యేమిటొ ; బెండపూడి సా
ధనుగని పాండురంగ ! జలధుల్ విబుధుల్
చరణాలు పట్టెగా ॥

మడులను గట్టి యీ సుకవి మండల
కావ్య విమర్శ కర్షకుల్
వడిగల పెద్ద పెద్ద వృషభాలయి
దున్ని వరాల పైర్లతో
నిడిన పసిండి పంటలను ఈదర
వేంకటరాయ మంత్రి యొ
క్కఁడు గద పాండురంగ ! ధరఁగట్టిన
దక్ష ధనుగ్రహించుమీ ॥

పేర్మి కందుకూరి వీరేశలింగము
మేరు వయ్యె తెనుఁగువారిలోన
వాని విప్లవాత్మ మానినీమణులకు
పండువంటి నోము పాండురంగ ॥

రాగద్వేషములేని విప్రులకుశూద్ర ద్వేషముల్ ముందుగా
రేగంజొచ్చి తదీయ జాతిపయివార్చెం సీసముల్కాఁచి ; నేఁ
డా గోలెవ్వరు సైప కివ్విధము బ్రహ్మద్వేషముల్ లేపుటల్
బాగోగైనది పాండురంగ ! వినుతింపన్జొత్తు సూతాశ్రమాల్॥

సూతుఁడు శూద్రుఁడైనను వచోనిధియై భువనైక దివ్య వి
ఖ్యాత పురాణ జాహ్నవి జగమ్ములలో ప్రవహింపఁజేసి సం
ప్రీతిగ మౌనిజన్మలు పవిత్రముఁజేసి ముదమ్ముతోడ భూ
మాతకు పాండురంగ ! తలమానికమయ్యె తృణీకరింతువా ?

తమ కన్నం కడు చిన్న జన్మగల శూద్ర శ్రేణిలో వాని దై
వముగా సమ్మి యనేకమైన పురముల్ ప్రాకారముల్ కట్టి ని
త్యము శ్రీకృష్ణునిఁ గొల్చుచుండినను బ్రహ్మద్వేషముల్ పుట్టి వై
రముతోఁ దిర్గిన పాండురంగ! యిక చర్చల్ శాంతిఁ జేకూర్చునా?

అసలీ యగ్రజులన్న బ్రాహ్మణులు కారయ్యా ! ప్రపంచంబులోఁ
గౌసకుం బుట్టినమానవుల్ సుమి; కవుల్ గుర్తించి యీ యర్థముల్
రసవంతంబుగఁ జెప్పి, నాల్గు గుణ కర్మంబుల్ షరుండైన వా
ని సిరుల్ సేసిన పాండురంగ! కులముల్ నిర్మూలమౌ చక్కఁగా॥

ప్రతిమనుజుఁడు తన జ్ఞానము
స్థితికిం దగినట్టి శౌర్యశీలము, వ్యాపా
ర తులావ్యవసాయము తన
బ్రతుకునకుం పాండురంగ ! పాలించుగదా !

వృత్తుల్ ముందుగ నిచ్చినందున సుమీ వేర్వేర్గుణంబుల్ ప్రజా
చిత్తంబందు జనించెఁగాని, గుణరాశింబట్టి వృత్తుల్ ప్రజా
యత్తం బిట్లొనరించినారనుట న్యాయంబేమికాదింక ; క్రొం
గ్రొత్తల్ కాలము పాండురంగ ! కులవైకుంఠుం ప్రశంసింపదే !

దేవుని నోటిలో తేటగాఁ బుట్టిన బ్రాహ్మణకోటి ప్రభావములకు
దేవుని భుజమందు ఠీవిగాఁ బొడమిన క్షత్రియజాతి ప్రఖ్యాతి సిరికి
దేవుని పొట్టలో లావుగా లేచిన వైశ్య వంశ సమస్త భాగ్యములకు
దేవుని పదమందు సేవతో మొలిచిన శూద్ర సమూహ నిర్నిద్రగతికి

తుట్టతుదకు దేవుని కొంప నట్టనడి స
ముద్రమున మున్గిపోయెడి ముప్పువచ్చి
కుల మతాల తుపాను దిక్కులకు పట్టె
భద్రముగ నేఁడు కాపాడు పాండురంగ !

## రాష్ట్ర సారధులు

రాజమహేంద్రవరమ్మున
బేజారై దేవళంబు వేంకటరాజే
నీ జైలుగఁ గట్టించెను
రాజాలవ ? పాండురంగ ! రాష్ట్రం బడఁగ ॥

గుంటూరు సింహ ముండగ
జింటాన్మాత్రలుగ నేఁడు సీతారాముల్
తంటాలు పడుట యేటికి
గంపైనద ? పాండురంగ ! కల రాష్ట్రముకై ॥

గుణమణియై రాజిల్లెడి
గణపతి పాత్రుఁడు మహోపకారుఁడు మాలో
అణకువగఁ జివరకైనను
ప్రణుతించుఁడు పాండురంగ ! రాష్ట్రము వచ్చున్ ॥

శ్రీ శ్రీ లింక మహోరా
జశ్రీ సలహా గ్రహించి జయభేరిని వి
శ్వ శ్రేయముగాఁ గొట్టిన
మీ శ్రమలకు పాండురంగ మేలు లభించుజ ॥



# కృతజ్ఞతాంజలి

చల్లని పండువెన్నెల పసందుగఁగాచెడి తెన్గుతోటలో
తల్లులు జ్ఞానవీర వనితామణులై విలసిల్లి యెందఱో
అల్లిరి స్వర్ణరత్న విజయాక్షర లక్షల పాలవెల్లి నీ
యుల్లము పాండురంగ మధురోదయమై పులకించ విశ్వముల్॥

ఈ రమా చిత్రశాలాధికారియైన
విశ్వనాథుండు సౌందర్యవృష్టి పోత
కు, రసగంగాధరుఁడయి వెల్గుగురునాథుఁ
డయి జగము పాండురంగ దివ్యముగ జూపె॥

బాల్యస్నేహితుఁడై ధర
కల్యాణి కళావిలాస కౌశలు డెంతో
మూల్యముగల ముద్రణతో
కల్యాణము పాండురంగ గద్దెక్కించెన్॥

ఆంధ్ర బెర్నార్డ్‌షా
వేదాంతకవి.